# భారతి

సాహిత్య మాసపత్రిక



సంపాదకుడు

శివలెంక శంభుప్రసాద్

నవంబరు 1958

సంపుటము 35 : : సంచిక 11

విడిపత్రిక వెల ఒక రూపాయి

# విషయానుక్రమణిక

## నవంబరు 1958

# మహాత్మ స్మృతి

శ్రీ కందుకూరి రామభద్రరావు

ఓయి మహాత్మ! నీవొక మహోన్నత పర్వతరాజ మట్లు, భ
ద్రాయితమూర్తివై భరతధాత్రిని నిల్వగ, సర్వమానవుల్
పోయిన సత్తువల్ తిరిగి పొంగులువెట్ట, భవత్ప్రబోధనం
ధాయిత చిత్తవృత్తుల విదల్చిరిగా పరదాస్యశృంఖలన్.

కోసినో రాక నవ్వుపాల్పు వెలార్చెనా
పండువెన్నెల మెదల్ నిండిపోయె
పల్కులు జడిగట్టి పైకి వర్షించెనా
అమృత ప్రవాహంబు లంత బారె
కరుణాకటాక్ష వీక్షణములు పరగినా
వంత హృద్యాదయవసంతమెసఁగె
ధైర్యహేమాచల దర్శనంబబ్బినా
మంటి ముద్దల వీరమణులు పుట్టె

అవని పులకింప నీవొక్క యడుగుపెట్ట
మానవాంభోధి జయఘోష మార్మ్రోఁగ
ధర్మ సంస్థాపనార్థ పథంబువట్టి
పుడమిమెట్టిన యవతారమూర్తి వీవు.

ప్రేమకు వచ్చె నీయెడద పెంపునఁ గోమల నవ్యకాంతి, నీ
నేమపు బాటలో నలిగి నిష్ఠయె నూతన పుష్టిగాంచె, గా
రామున నీపుకే లొసఁగ రాచరికంబు వహించె శీల, మే
మేమి వెలుంగు గుంపులకు నేలిక లయ్యె భవత్కటాక్షముల్

శిథిలపర్ణకుటీర చిరనిరంతరదుఃఖ
ఖిన్నుల కన్నీరు కేలఁదుడిచి
పరదాస్యశృంఖలాబద్ధ నిస్పృహులకు
హృదయగవ్వార తేజ మెసగఁద్రోచి

**[illegible]**

అజ్ఞాన తిమిరసీమాంతరాంతరముల
మినుకు దివ్వెలు నిల్పి మేలు కనిపి
రక్తసంసిక్త సామ్రాజ్యరాక్షసకరాం
భోజముల్ ప్రేమధులోన్వసి కడిగి

సభ్యనాగరక ప్రసన్నతలవరుము
తొలగు జీవితమూల్యంబు నిలువబెట్టి
చన్న నీ స్థితప్రజ్ఞకు స్తవనమొడ
నరుల గుండెలలో కృతజ్ఞతలు దక్క

కానియు లేదు నీకయినఁ గాంచన వర్షము నీయధీన, మె
ద్దానికి లేదు నీవిభుత, కాల్చె ప్రభుత్వము నీదు నాజ్ఞ, లీ
మానవకోటికిఁ శిరసు మండన మయ్యె భవచ్చరిత్ర, వ్యా
ఖ్యానము గీతకున్ బ్రదుకు, కారణజన్ముడవయ్య ధాత్రిపై

తూరుపుద్వారమందుఁ బరితోషణ తోరణకాంతిపుంజముల్
దీరిచి, మంగళధ్వనులు దిక్కుల బర్వ స్వరాజ్య లక్ష్మికిన్
భారతనారులు న్నరులు పట్టముగట్టిరి పండువృద్ధవై
వారలనమ్రశీర్షములపై వెదజల్లితి మందహాసముల్

పిచ్చికిఁగూడఁ గొంతగ వివేకము కన్పడు, బుద్ధి యొంతక
మ్మెచ్చున లాగినన్ విడదు మీమహిమోజ్జ్వలమూర్తి లోపలన్
చిచ్చుఅరవ్వలన్ బఱప చేయెటులాడెనో! గుండెనిల్పెనో!
చొచ్చె తమస్సు నీ పరుగ, శోకము నిండె సమస్త లోకమున్.

మానవమనోంబరంబున మార్గదర్శ
కంబుగ వెలుంగు ధ్రువతారగా మహాత్మ!
పలు శతాబ్దులు నిల్చెదు, పాణిపద్మ
ములు మొగిడ్చి నమస్కృతముసుఘటింతు.

# స్వర్గీయ శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణ

శ్రీ ఆమంచర్ల గోపాలరావు

కత్తి పట్టుకొని జయించవచ్చు, లేక స్వర్గం దూర గొనవచ్చు వీరత్వం అని సామాన్యుల అభిప్రాయం. కాని ఆయుధాలన్నీ విసర్జించి, సహనంతో నే సాయుధుల నెదిర్చి స్థైర్యంతో నిల్చడం నిజంగా మహాయోధ లక్షణం. గాంధీజీ మొట్టమొదటగా లోకానికి కనువిప్పు కలిగించి ఈ విషయమే వెల్లడి చేశారు. ఆ రీతిగానే అనేకమంది యోధులు తమకాలంలో నిరంకుశాంగ్లేయుల బలాన్ని ఎదిరించి పోరాట వీరులయి నారు. ఈ మహాయోధ బృందంలో, ఎవరికీ తీసిపోని మహనీయుడు మన ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులు.

ఆయనతో మాట్లాడు తున్నప్పుడుగాని, వ్యవహ రిస్తున్నప్పుడుగాని ఉన్నవవారి వీరలక్షణం వెంటనే స్ఫురించదు. అనేక ధోరణులతో, అనుక్షణం తోడి వారిని నవ్విస్తూ, మహా వినోద ప్రియునివలె కనిపించే నారాయణ అయినప్పటికీ, వారి జీవితపంథాలో అసలు విశ్రాంతికి తావులేదనీ, సంకల్పించిన మహాకార్యాన్ని గురించే అనుక్షణము ఆలోచించేవారనీ, త్వరలోనే స్పష్టమవుతుంది. ఇది మహా విలక్షణమని వేరే చెప్ప నక్కరలేదు. గాంధీమహాత్ముని ధీరోదాత్తత కూడా ఇటు వంటిది. ఇట్టి మహాయోధుల సాంగత్యంలో రోజులు రోజులే నిమిషాలుగా గడిచిపోతాయి. జరపవలసిన కార్యక్రమం మేరువంత ఎగురయితే అదెంత మహా తీరమైనదైనా అతి తేలికగాను, సునాయాసంగాను జరిగిపోతుంది. అందుచేతనే, ఎంతటి గొప్ప కార్యక్రమం తలపెట్టినా లక్ష్మీనారాయణగారు తన శిష్యబృందసహాయంతో అదంతా అవలీలగా నిర్వ హించేవారు.

ఉన్నవ లక్ష్మీనారాయణగారి ప్రథమ సందర్శనం నేనెన్నడూ మరిచిపోలేను. గుంటూరులో ఆనాడు Y M L A అని ఒక చిన్న క్లబ్బు ఉండేది. ఆ క్లబ్బులో ఆనాడు ఉత్సాహవంతులైన యువకు లందరు సభ్యులే. లక్ష్మీనారాయణగారు తమ కారాగార వాసం పూర్తి చేసి తిరిగి గుంటూరు వచ్చేనాటికి ఆ క్లబ్బుకాయన కూడా రోజూ వచ్చేవారు. సహాయ నిరాకరణోద్యమంలో చదువు మానివేసిన నేను మళ్ళీ గుంటూరుకొచ్చి హైస్కూలులో ప్రవేశించాను. ఖద్దరు బట్టలు వేసుకొని గాంధీ టోపీ పెట్టుకొని సాయంత్రం కాగానే ఒకనాడు నేనా క్లబ్బుకు వెళ్ళాను. లక్ష్మీనారాయణగారు ఒక కుర్చీ మీద కూర్చుని అందరితోను ముచ్చటిస్తున్నారు. ఆయన ఏదో చెబుతున్నారు. అవి వింటున్న అందరితోబాటే ఆయన కూడా నవ్వుతున్నారు. వారిని నేను వెంటనే గుర్తుపట్టాను. కాని దగ్గరకెళ్ళి మాట్లాడే ధైర్యం కలగలేదు. ఆయన నన్ను చూచి ఒక్కసారి పక్కకు వచ్చారు. నన్ను దగ్గరకు పిలిచి, భుజం మీద చెయ్యి వేసి, 'ఏం చదువుతున్నావ'ని అడిగారు. 'ఆయిదో ఫారం' అన్నాను. మళ్ళీ నవ్వుతూ "ఏం! గాంధీ టోపీ పెట్టుకుంటే మీ హెడ్మాస్టరు నిన్ను స్కూలుకు రానిస్తున్నారా?" అని అడిగారు. "రానిస్తున్నారండీ" అన్నాను. "కాదులే, మావా ఆంజనేయుల్ని వెళ్ళగొట్టారులే" అని తిరిగి నవ్వారు. నిజంగా, మహాత్ముని ఆదేశించకున్నా, ఇట్టి వీరపుంగవుల కార్యకలాపాలే స్వరాజ్య పథక ప్రథమ సోపానాలై ప్రజలను ప్రోత్సహించాయి. నాడు గుంటూరులో పెద్దమనుష్యులన్నవారంతా ఖద్దరుతప్ప మరొకటి ధరించేవారు కారు. ప్రతి శిరస్సు గాంధీటోపీ అలంకరించేది. ఆనాటినుంచి, దాదాపు ప్రతిదినం నేను వారిని కలుస్తూనే ఉండేవాణ్ణి. ఎప్పుడూ, నవ్వుతూ నవ్విస్తూనే మాట్లాడుతూండేవారు. కాని ప్రతిపదంలోను దేశపరి స్థితులు, మన బానిసత్వం, త్యాగనిశ్చయత ప్రతి ధ్వనిస్తూ ఉండేది.

అప్పటికే గుంటూరుజిల్లాలో సత్యాగ్రహో ద్యమం అలవాటయింది. చీరాలలో దుగ్గిరాల గోపాల కృష్ణయ్యగారు, పెదనందిపాడులో కొండా వెంక టప్పయ్యగారు, పలనాడులో ఉన్నవ లక్ష్మీనారా యణగారు నాయకత్వం వహించారు. పలనాటిగడ్డ

లక్ష్మీనారాయణగారికి అతి ప్రియమయినది పల్నాటి వీరచరిత్రను గూర్చి, బాలచంద్రుని గురించి మాటిమాటికీ వారెంతో ఉత్సాహంగా ప్రసంగించేవారు. బాల చంద్రుణ్ని గూర్చి ప్రసంగించే సమయాలలో నవ్వు వారి ముఖాన్ని అలంకరించేదికాదు. కళ్లు మెరిసేవి. ఒక ఆవేశంతో దేహమంతా వణికిపోయేది. ఆ రోజుల్లో దేశస్వాతంత్ర్య సమరానికి అట్టి వీరు లెంతో మంది అవసరం. అట్టి వీరుల గడ్డలోనే సత్యాగ్రహ సమరానికి ఉన్నవ లక్ష్మీనారాయణగారు నాయకత్వం వహించారు. యావద్భారత దేశంలోను ప్రప్రథమంగా నిర్బంధింపబడి, కారాగారానికి వెళ్ళినది శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులు.

కార్యకలాపాల్లో, క్లిష్టపరిస్థితుల లేర్పడినప్పుడే ఆయన గొప్పతనం బయటపడేది. మొదట, సహాయ నిరాకరణోద్యమంలోనే, ఆయన గొప్పతనం బయలుపడింది. చీరాల, పెదనందిపాడు, పలనాడులలో సత్యాగ్రహం ప్రారంభించారు. నిరంకుశులైన బ్రిటిషువారు ఆ ఉద్యమాన్ని లెక్క చెయ్యలేదు. కనుమూసుకొని కొంతకాలం గడిపితే, ఆ ఈ ఉద్యమం దానంతట అదే సమసిపోగలదని వారాశించారు. కాని లక్ష్మీనారాయణలాంటి వ్యక్తులా నిరంగా జరగనీయలేరు. క్రతువులను రద్దుకొట్టి, రద్దుకిస్తీ సత్యాగ్రహం జయం కాని బ్రిటిషువారిని రద్దుకొట్టడం సామాన్యమయిన కార్యంకాదు. లక్ష్మీనారాయణగారు ఆలోచించి ఆలోచించి అటవీసత్యాగ్రహం మొదలుపెట్టించారు. వీరుల గడ్డ అయిన పల్నాడులో ఇది బాగా సాగింది. బ్రిటిషువారికి ఉపేక్ష చేయడానికి వీలులేదు. నాయకుల నందరిని వెంటనే నిర్బంధించడం మొదలుపెట్టారు. ఆనిర్బంధాలు ప్రజలను మేలుకొలిపాయి. వారు స్వరాజ్యావసరం గుర్తించారు. సహాయనిరాకరణోద్యమం జయించింది. కాని మహాత్మాగాంధీ ఆ ఉద్యమాన్ని అంతటితోనే ఆపివేశారు.

ప్రథమ కారాగారవాసం పూర్తి చేసుకొని తిరిగి రాగానే లక్ష్మీనారాయణగారు ఒక దివ్యకార్యక్రమం తలపెట్టారు. బహుశః జైలులోనే ఈ కార్యక్రమాన్ని గూర్చి బాగా ఆలోచించారని తోస్తుంది. ఆయన, వారిసతీమణి లక్ష్మీబాయమ్మగారు, శారదా నికేతనానికి పునాదులు వేశారు. ఊరి చివరన ఒక పెద్ద స్థలం. అందులో పాఠాలు నేర్పే స్వాతంత్ర్యం కొరకు పోరాడేవారే ఉపాధ్యాయులు. విద్యార్థినులు బాలికలు. ఆనాడు స్కూళ్ళలో వారికి సరియైన శిక్షణ లేదని, సరియైన శిక్షణ కలిగిన స్త్రీలు స్వరాజ్యోద్యమానికి ఎంతయినా తోడ్పడతారని లక్ష్మీనారాయణగారి అభిప్రాయం. శారదానికేతనం ప్రారంభించినప్పటినుంచి గుంటూరులో కాంగ్రెసు బలం బాగా ఇనుమడించింది. ప్రతి కార్యక్రమానికీ శారదానికేతనం బాలికల సహాయ్యం అనంతంగా ఉండేది. మన స్వాతంత్ర్య సమరంలో ఆంధ్రదేశము అందులోను గుంటూరుజిల్లా ముందంజ వేయడానికి దానికి శారదా నికేతనం ఒక ప్రబల కారణం. అనాటి గత సంవత్సరం వెన్నెలకంటి వీర రాఘవయ్యగారు ఢిల్లీలో మన రాష్ట్రపతి రాజేన్ బాబుతో ప్రసంగించారు. భారతదేశంలో స్వదేశోద్యమం అనేది ఒక్క ఆంధ్రలోనే నడిచిందని రాజేన్‌బాబు ఆ ప్రసంగంలో అన్నారట. ఆంధ్రలో కాంగ్రెసు ఉద్యమం ప్రజల ఉద్యమంగా రూపొందించడానికి శారదానికేతనం ఎంతో సహాయ్యం చేసింది. దీనిలో అతిశయోక్తి లేదు.

ఆరోజుల్లో కాంగ్రెసువారు ఏర్పాటుచేసే ప్రతి సభకు శారదా నికేతన విద్యార్థినులు వచ్చేవారు. అతిరసవంతంగా జాతీయ గీతాలు పాడేవారు. ప్రజల కెంతయినా ఉత్సాహం కల్పించేవారు. ఇంతేకాదు కాంగ్రెసు తలపెట్టిన ప్రతిచిన్న కార్యక్రమానికి ధనం కావాలికదా! కటకటలేక, నాడు కాంగ్రెసు చాలా బీద సంస్థ. నికేతన బాలికలు జాతీయగీతాలు పాడుతూ అందరి ఇళ్లకు వెళ్ళి కావలసిన ధనం పోగు చేసేవారు. నిజంగా శారదానికేతనం ఆనాడు గుంటూరు జిల్లాలో కాంగ్రెసు సంస్థ బీదరికాన్ని పటాపంచలు చేసింది.

1930 వ సంవత్సరంలో జరిగిన సత్యాగ్రహోద్యమానికి గుంటూరులో జీవంపోసి పెంచినది ఉన్నవ లక్ష్మీనారాయణగారే అని చెప్ప వచ్చును.

ఆ ప్రారంభోత్సవ మెన్నడు మరచిపోలేము. పెద్ద స్వరాజ్య ప్రభ కట్టించారు. ఇరువదినాలుగు ఎద్దులు కట్టిన బండిమీద ప్రభ నిలబెట్టారు. ఉన్నవ వారి శిష్యులు శ్రీ నాదెండ్ల బ్రహ్మయ్య, మొదలయినవారు అగ్నిప్రభ కెదురుగా నిలిచి, లక్ష్మీనారాయణగారు

# స్వర్గీయ శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణ

రచించిన దండకం, బుర్రకథ దరువులూ, అగ్నిరథ, అగ్నిగధ అని నినాదాలతో జనాన్ని ఉద్రేకపూరితులుగా చేస్తున్నారు. సుమారు రెండు వేలమంది స్వచ్ఛంద సేవకులు బారులుతీరి నిల్చున్నారు. ముందు తప్పెటలు, తాళాలు, ఇంకా అనేక వాద్యాలు. గుంటూరు జనమంతా ఆ ఉత్సవంలో పాల్గొన్నారు. అహింసగా మొదలయిన ఆ ఉద్యమానికి విజయం తప్పదనే విశ్వాసం అక్కడ ఉన్నవారందరికీ కలిగింది.

అది ఒక పెద్ద ఊరేగింపు. మేమంతా గుంటూరు కలెక్టరాఫీసు దగ్గరకి చేరుకున్నాము. దాదాపు రెండువందలమంది శారదా నికేతన బాలికలు మా వెనుక నడిచారు. వారివెంట మరో లక్షజనం ఉన్నారు. "వీరగంధము తెచ్చినారము, వీరు లెవ్వరో తెల్పుడీ! పూసిపోదుము మెడను వైతుము పూలదండలు భక్తితో!" అనే పాట ముక్త కంఠంతో పాడుకుంటూ సాగుతున్నారు. ప్రతి స్వచ్ఛంద సేవకునికీ తిలకం పెట్టారు. ఎర్ర గంధం పూశారు. మెడలో ఒక పూలమాల వేశారు. ఆ దృశ్యం చూడవలసిందే కాని వర్ణింప వలనుకానిది. వీర రసం ఆనాడు మహా సముద్రంలా పొంగింది. అప్పుడు ఊరేగింపులో వచ్చిన ప్రతి వ్యక్తీ అనేకమారులు లాఠీ చార్జీలకు గురి అయినాడు. జైలుకు వెళ్లాడు. కాని ఎవ్వరు క్షమాపణ ఇచ్చి విడుదల కాలేదు.

మన స్వరాజ్య సాధనలో, శారదా నికేతనం ఎంతో ఉపకరించిందనడంలో అతిశయోక్తి లేదు. ఆ ప్రకారం అత్యుత్సాహంతో ప్రారంభించిన ఆ సత్యాగ్రహోద్యమం, జయప్రదం కావడానికి కూడా లక్ష్మీనారాయణగారే ముఖ్యకారకులని చెప్పవచ్చు. ఆనాడు దాదాపు రెండువేలకు మించిన వలంటీర్లబృందమంతా యడ్లపల్లి వారి సత్రంలో మకాం చేశారు. రోజూ పికెటింగు చేసేవారు. సమావేశాలు ఏర్పాటుచేసి ప్రచారం చేస్తూ ఉండేవారు. ప్రతిరోజూ క్రొత్తవారు వచ్చి స్వచ్ఛంద సేవకులుగా చేరేవారు. రోజూ రోజూ ఆ సంఖ్య పెరిగి పోతున్నది. ఆనాడు కాంగ్రెసు అనధికార సంస్థ. ఎన్ని రోజులు గడిచినా ఎరస్టులు లేవు. ఊరికే కేసులు వేసి శిక్షించేమో మానివేయడం జరుగుతుందా అనే భీతికూడా నాయకులలో మొలకెత్తింది. కాని వెంటనే లక్ష్మీనారాయణగారు క్రొత్త ప్రణాళిక సూచించారు. దానితో గుంటూరుజిల్లాలో కాంగ్రెసు ఉద్యమం తీవ్రమయింది.

మొట్టమొదట ముప్ఫయిమంది యువకులను ఏరారు. శ్రీ గౌస్ బేగ్, శ్రీ మంత్రిప్రగడ వెంకటరత్నం, శ్రీ తూములూరి శివరాము, శ్రీ అన్నాప్రగడ కామేశ్వరరావు, నేను ఇంకా మరికొంత మందితో కలిసి లక్ష్మీనారాయణగారి ఆజ్ఞననుసరించి దేవరంపాడు వెళ్ళాము. అక్కడకూడా గుంటూరులో లాగానే, మూడు నెలలుండి, మూడువందలమందితో కాంగ్రెసు శిబిరం నడుస్తున్నది. నిర్బంధాలు లేవు. మేమిప్పుడు ప్రభుత్వాన్ని ప్రజలను రెచ్చగొట్టాలి. మేము దేవరంపాడులో పదిహేను రోజులపాటు ప్రతి రోజూ లాఠీఛార్జీ ఎదుర్కొన్నాము. దుమ్ములో ముళ్ళ కంపలలోకూడా పడవేసి ఈడ్చారు. చివరకు జనంలో కోపాగ్ని చెలరేగింది. బల్లకొద్దీ ఉప్పు తీసుకువచ్చాము. అక్కడ ఆ నెలలో మూడువందలకు పైగా నిర్బంధాలు జరిగాయి.

ఇంకొక విషయం: గుంటూరు పరిసర ప్రాంతాలలో తాటిచెట్ల సత్యాగ్రహం అనే క్రొత్త ప్రణాళిక లక్ష్మీనారాయణగారు ప్రవేశపెట్టించారు. దీనికి ప్రతిచర్య దొరతనం తట్టుకోలేకపోయింది. రెండు నెలలయ్యేసరికి గుంటూరులో నయితేనేమి, గుంటూరు జిల్లాలో నయితేనేమి, నిర్బంధాలు రెండు వేలకు పైగా పెరిగిపోయాయి.

అతి క్లిష్ట పరిస్థితులలోకూడా, నిరుత్సాహం పోగొట్టి, ఉత్సాహం కల్పించి, శత్రువులను రెచ్చగొట్టి వారి పరాజయమార్గం తయారు చేయడంలో ఉన్నవ లక్ష్మీనారాయణగారు సాటిలేని మేటి.

జైలులో వారితో కలిసిఉండే దినాలుకూడా వినోదాలలా గడిచిపోయేవి. ఆయనకు తెలుగు భాషన్నా, తెలుగు దేశమన్నా అతిప్రీతి. ఎప్పుడు తెలుగు కవులనుగూర్చి చర్చిస్తూ ఉండేవారు. మన దేశంలో, బౌద్ధయుగం నాటినుండి ఎన్ని ఉద్యమాలు ప్రజల నావహించాయో సవిస్తరంగా చెబుతూ ఉండేవారు. అనేక ఉత్తమోద్యమాలకు మనదేశం అనాదినుంచీ ఆలవాలమయింది. ఎప్పుడూ ఒక క్రొత్త పద్ధతికోసం మనఆంధ్రులు పాటుపడ్డారు. వైదికమతం నుంచి బౌద్ధమతంలోకి మారిపోయారు. అది సరిగా

లేదని మళ్ళీ శంకరమతం అవలంబించారు. అంతలో మహమ్మదీయుల కాలం వచ్చింది. ఆ కాలంలో ఎదుర్కొని మనవాళ్ళు నిలబెట్టుకున్నారు. అంతలో బ్రిటిషువారి కాలం వచ్చింది. తెలుగువాడు తెలుగువాడుగా లేడు మనకు వేరే రాష్ట్రం రావాలి. కాని అన్నిటికంటె ముందుగా దేశానికి స్వాతంత్ర్యం రావాలి ఇలాంటి భావాలన్నీ ఆయన వ్యక్తిత్వ భాగాలే అని చెప్పాలి ఆయనదగ్గిర చేరిన ప్రతివ్యక్తికి ఈ భావావేశం లేని మరి వదిలేదికాదు నేటి మన ఆంధ్రరాష్ట్రానికి బీజం వేసింది నిజంగా ఉన్నవ లక్ష్మీనారాయణగారే అనుటకు సందేహం లేదు 1910 వ సంవత్సరంలో నే భాషాప్రయుక్త రాష్ట్రాలు కావాలనే వాదం వారు ప్రకటించారు.

1931 వ సంవత్సరంలో అందరూ జైళ్ళనుంచి తిరిగి వచ్చారు లక్ష్మీనారాయణగారికి గాని ఆయన శిష్యులకుగాని అంతటితో తృప్తికలగలేదు స్వరాజ్య సాధనకు ఇంకా ఎన్నో రకములయిన ప్రణాళికలు కావాలని ఆయన నిత్యమూ ఆలోచిస్తూ ఉండేవారు.

1936 వ సంవత్సరంలో కాంగ్రెసు ప్రణాళిక మారింది. ప్రభుత్వంలో పాల్గొనాలని కాంగ్రెసు మహా నాయకులు నిర్ణయించారు దేశ స్వాతంత్ర్యానికై నిరంతరంగా పోరాడే మన నిర్బంధమంతా, మన దేశంలో ఒక పక్షంగా ఏర్పడింది లక్ష్మీనారాయణ గారికది నచ్చిందేమీ పక్షం ఏర్పడడం సహజమే గాని ఆ పక్షప్రణాళిక సమయం, మన పోరాటాన్ని ముందుకు సాగించే పద్ధతుల ననుసరించాలని వారు కోరారు.

అంతలో 1942 వ సంవత్సరం వచ్చింది ఆ రోజుల్లో లోకమంతా మహా సంగ్రామంలో మునిగి తేలుతున్నది. లక్ష్మీనారాయణగారికి అప్పటికే వయస్సు మీరింది. కాని వారి ఉత్సాహం ఏమీ తగ్గలేదు. ఇక ఉద్యమం వదులుకబడ్డ పల్నాడులో జరపవలెనని వారు ఉద్దేశించారు.

నిజంగా ఆనాడు పల్నాడు బ్రిటీషువారికికూడ ఒక ముఖ్యస్థాన మయింది యుద్ధానంతరం ఆంధ్ర భాగం హైదరాబాదుభాగంతో కలపాలని వారు నిర్ణయించుకొన్నారు. దానికోసం కృష్ణానదిపై శాశ్వతంగా వంతెన నిర్మించడం మొదలుపెట్టారు. ఆ వంతెనవల్ల సైనికంగా ఆ రెండుభాగాలు ఏకం కాగలవని వారి అభిప్రాయం

అక్కడే బ్రిటిషువారిని ఎదుర్కోవాలి. వీర పల నాటినించే స్వరాజ్యోద్యమం కావాలి వారి ఆశయం అది. ఒకనాడు పొద్దున్నే లక్ష్మీనారాయణ పంతులు గారు మా ఇంటికి వచ్చారు.

“గోపాల ! నీవు పల్నాడువెళ్ళాలి ”

“సరేనండి! పంతులుగారూ! అక్కడ మన శిష్యులెవరెవరా ఉన్నారా ?”

“ఇదికేవల దైవకార్యం! నీవు వెళ్ళు. శిష్యులు వారంతట వారేవస్తారు!”

అంతే! అదే వారి సహజధోరణి: సాధారణంగా ఆ కాల ధర్మోక్తులతో ఎన్నో విధాల వర్ణిస్తున్నప్పటికీ, కార్యంపట్ల ఆయన అతి మితభాషి. వారి ఆజ్ఞలన్నీ సైనికాధికారి ఆజ్ఞలవలె అతిక్లుప్తంగా ఉండేవి.

ఆపైన నేను పల్నాడు చేరుకొన్నాను. తిమ్మంకట తోపుచేరి, అనేకమంది శిష్యులు చేరుకొన్నారు. కాని ఆనాడక్కడ మాకు శత్రువులుకూడా జాస్తి ఆమూర్తి పల్నాడు ఆరోజులలో కమ్యూనిస్టులకు ఆటపట్టుగా ఉండేది. మా కార్యక్రమాన్ని భంగం చేయడమే నాడు వారి పరమావధి కాని లక్ష్మీనారాయణవంటి నాయకులు వారికి లేరు ఏదిఏమైనా నయితే నేమి, బ్రిటీషువారికి అలజడికలించేటంతలో ప్రజలలో పెద్ద ఆందోళన బయలుదేరింది. ఆ కాలంలో రైలు పట్టాలు లాగి వేశారు. వంతెనలు పాడుచేశారు. ప్రజలింకా ఆవేశించారు.

లక్ష్మీనారాయణగారు, తక్కిన నాయకులతో బాటే మళ్ళీ జైలుకువెళ్ళారు.

అంతలో, సుభాష్‌బోసు కృషివల్ల నయితేనేమి, గాంధీజీ తపః ఫలితంవల్ల నయితేనేమి, లోకంలో యుద్ధానంతరం వచ్చిన క్లిష్ట పరిస్థితులవల్ల నయితేనేమి మన దేశానికి స్వరాజ్యం వచ్చింది అనేకమంది ఇక మనం చేయవలసిన పని అయిపోయిం దనుకొన్నారు

కాని ఉన్నవ లక్ష్మీనారాయణగారలాగ భావించలేదు. ఆంధ్రరాష్ట్రం రావాలి స్వాతంత్ర్య సమరంలో నిన్నటి, పెద్దల ఆశయాలు చితికిపోయాయి. వారికి దారిచూపెట్టాలి. దేశాభ్యుదయానికి వారిచేత పని

# స్వర్గీయ శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణ

చేయాలి. ఆ రెండు విషయాలు అనుకూలం లక్ష్మీనారాయణగారి దృక్పథంలో ఉండేవి. ఎప్పుడు వాటి విషయమే చర్చిస్తూ ఉండేవారు. వారు బ్రతికి ఉండగానే ఆంధ్రరాష్ట్రము, సంపూర్ణాంధ్ర రాష్ట్రము సిద్ధించాయి.

కాని స్వాతంత్ర్యోద్యమంలో చితికిపోయిన పేదల సమస్య, ఆఖరి ఊపిరివరకూ వారి దృక్పథంలోనే ఉన్నదని చెప్పకతప్పదు. గత సంవత్సరంలో కూడా ఆయన రాజకీయ బాధితుల సమావేశానికి అధ్యక్షత వహించారు.

ఉన్నవ లక్ష్మీనారాయణగారు స్వర్గస్థులైనారు నిజంగా అటి వ్యక్తులు మరణిస్తారా! కాని నేడు వారు కీర్తిశేషులే అయినారు. వారు రచించిన కొన్ని ఉద్గ్రంథాలు, వారి స్మృతి తప్ప మనకేమి మిగలలేదు.

ఉన్నవ లక్ష్మీనారాయణగారు లోక ప్రశస్త లక్ష్యంతో జన్మించిన మహావ్యక్తులనటంలో అతిశయోక్తి లేదు. లోకంలో క్లిష్టపరిస్థితులు వచ్చినప్పుడు మానవు లంధకారంలో పడి దోవ తెలియక సతమత మవుతున్న సమయాలలో ఇటువంటి మహావ్యక్తులు జన్మిస్తారు. తోవచూపి, సత్యమార్గాన నడిపించి మానవుల్ని తరింపజేస్తారు.

గాంధీ మహాత్ముడు తన మహోద్యమం ప్రారంభించే సరికల్లా, లక్ష్మీనారాయణగారివంటి దివ్యమానవులు చేతులుకట్టి సిద్ధంగా ఉన్నారు. కొండా వెంకటప్పయ్య, కాశీనాధుని నాగేశ్వరరావు పంతులు, దుగ్గిరాల గోపాలకృష్ణయ్య, బులుసు సాంబమూర్తి, టంగుటూరి ప్రకాశం, డాక్టర్ సుబ్రహ్మణ్యం, ఉన్నవ లక్ష్మీనారాయణ మొదలైన మహాపురుషు లందరు, గాంధీజీ ఉద్యమం కోసమే వేచి ఉన్నట్టు తోస్తుంది వారందరూ, ఆనాడు తమతమ నిర్దిష్ట కార్యక్రమాలాదరించి, మన స్వరాజ్య రథాన్ని ముందుకు నడిపించారు. వారంతా అవతరించి ఉండకపోతే మనకసలు స్వరాజ్యమే లభించి ఉండదేమో అని కూడా అనిపిస్తుంది. ఆ స్వాతంత్ర్య యోధులందరూ అమరులు. ప్రాతః స్మరణీయులు, వారికి నా నమోవాకాలు.

దనుకుంటూ స్టేషన్ లోని వాళ్ళు తన్ను పలకరించు తూంటే దొరికి తగిన సమాధానం చారికిస్తూ, ఆపిల్లల గుంపును వెంటబెట్టుకుని వెంకమ్మ బజారుకి దల్లగా వెళుతుంది.

వారంట నడుస్తున్నారంతా త్వరిత గమనంతో తెలుసుకుంటూనే మొటమొదట యింటికెదనుండి బయలు దేరినప్పుడున్న చలాకీ కబుర్లు నవ్వులూ పూర్తిగా విస్మరించారు కాని, ఆనవతలో యింకా ఆ అహం కారము స్వతంత్రత పూర్తిగా తొలగించి ఉన్నాయి వాళ్ళు బజారుకుపోయి కొనవలసిన బియ్యం అన్నీ కొని, పదుల కంటబడకుండా ఉండ డానికని ఆ చేతి సన్న పెద్ద మూటలు కట్టి మళ్ళీ రైల్వే స్టేషనుకు బయలుదేరారు.

వెంకమ్మ మిగతా వాళ్ళందరకు వసెమురోజులసిన రీతి బోధిస్తూంది ఎవరితోనూ యేమీ మయిన మాట పట్టింపు పెట్టుకోకూడదనీ, తనుపని చక్కబెట్టుకునే వరకూ వినయంగాను, ప్రార్థనాపూర్వకంగాను మాట్లాడమనీ సూచించింది

మిగతా వాళ్ళు అంతా వెంకమ్మంత అనుభవశాలులు కాకపోయినా యీ విషయాల్లో కొంచెం విజ్ఞాన వంతులే అవి చెప్పకపోవాలి వారలుకి ప్రత్యేకం యీ ప్రాక్టీసు పనిపెంలోను, ప్రాణాలలోనూ నమ్మ కంలేగు వటికల మనుషులు యెంత కుమిలిపోవాలో, నవ్వులాట పాలవలో చాలాచాలా సార్లు అనుభ వించిన విషయం.

ఇలాంటి చట్ట వ్యతిరేక వ్యాపారాల్లో ముఖ్యంగా దీనాలాపాల ప్రభావం అతి స్వల్పం చిల్లి గవ్వపనికూడా జరగదు "ఆమీ విగంగా పొట్టపోసు కోవలెనని చూస్తే, ఓ ఉద్యోగి కాస మంచి మంచి దుస్తులు తొడుక్కొని దర్జాగా కాలం గడపాలని చూస్తాడు. మరో దొంగవ్యాపారి అంతస్తుపై అంతస్తు మేడలు కట్టించాలని చూస్తాడు దీనిలో జాలీ దయా యెక్కడిది?" అనుకుంటుంది వాకలు

అయినా వెంకమ్మలో ప్రత్యేకత ఉంది ఆమె టక్కరి బొల్లి బోలి యెత్తులతో చాలా గొప్పపనులు తను కన్నుల యెదుటగానే చేయగల్గింది అందరూ వెంకమ్మలా ఎలా చేయగలరు! అందుకే తనకు సాధ్యంగాకపోయినా ఆమె మాటలు అందరూ మౌనంగా వింటారు.

వాళ్ళు వార్లో వాకీ దూరంగా దూరంగా నడుస్తూ అనుమానంతో అప్పుడప్పుడు దాచాకీదారు వైపు చూస్తూ నడుస్తున్నాగా కొళ్ళు దల్లగా వారు తూంటే ఆ చౌకీదారు చేతో సంజ్ఞ చేశాడు వెంకమ్మకూడా సంజ్ఞా పూర్వకంగానే సమాధానం ఇచ్చింది వాడు మీసాలు మెలికుతూ అటువైపు చూస్తూ నిలబడ్డాడు

అతడి భుజంమీద బరువుగా పడింది దెబ్బ అతను ఉలిక్కిపడి అటు చూశాడు కొత్త జంకోడు

"ఆ! యేమిటూ సంజ్ఞలు! ఆ ముసలిదాన్నెరుగువా?"

"అబ్బే ఏం లేదండి"

దాంతో చేతో సంజ్ఞలు చేస్తున్నావు. మంచి నక్కల్లాంటి కుంట తెల్లంచేసుకు తిరుగు తోంది యేటి సంగతి"

"యేటో చిన్న చిన్న యాపారాలు చేస్తున్నా రండి"

"యేటా యాపారాలు యేదన్నా పిల్ల యీమె కాలబడ్డా కేంటి"

"అబ్బే కాదండి. అలాంటి గొడవ ఏం లేదు"

"మరి నువ్వు చెయ్యాల్సుకున్నావు, అదీ చెయ్యాల్సుతూంది!"

"ఆ ముసలిదాన్నెరుగుదువులెండి"

"అదిగో దానికెందుకే యెరుకూంది, కొత్త వాడాగా పోసుగా ఉంది దాన్ని చూస్తే మనసు చెవిపోతూంది ముసలా చేస్తున్నా కదపగలవా?" అన్నాడా వ్యక్తి చౌకీదారు విస్మయంగా ఉన్నాడు. కొత్త దూరం నుంచి వెంకమ్మ జట్టు దొంగ చూపులు చూస్తూ కదలిపోతున్నారు.

"ఏం మాట్లాడవేం" ఆ ముసలిదాన్నెలా యెరుగుదువు?"

"బియ్యం యాపారం చేస్తోందండి" అన్నాడు అప్రయత్నంగా చౌకీదారు తినవాతి తన తెలివి తక్కువకు తానే తిట్టుకున్నాడు

"ఆ! అదా సంగతి అడగ్గానే మాటె చెప్పుతోంటారంతేగదూ! ఆహా" అంటూ వెళ్ళిపోయాడు చౌకీదారు తలొంచుకునే నిలబడ్డాడు

# పెద్దమనిషి

"అయితే యీ యాశం దొరకదాయేం" అన్నాడు కొత్త వ్యక్తి.

"వాళ్ళు యిదం వాళ్ళయిపోరండీ పాపం. పావలా లేదా లాభాని కమ్ముకుంటారు."

"పోనీ పశుగట్టికళ్ళి ఆ మాత్రమేనా పట్టి దగ్గిరవాడి పెళ్ళికొచ్చింనే కట్నం అనీ యివ్వకోక పోతే అసుంటచెవా లావుక్కగా" అన్నాడు పెద్దలేని అధికారంవల్ల గర్వుక్కుతూ. చాకిదాడు మాట్లాడ కుండా పనులంకించుకున్నాడు అయనుని ముసల్లో వెంకమ్మను కలుసుకున్నాడు.

"ఏం రాయుడా! అంత ఒకగన్నూ పనుగట్టుకు వచ్చావు నీకేమన్నా ముప్పు చెప్పకుండా ఉంటామా" అంది వెంకమ్మ దగాకేగా

"అతుగో అక్కడింకొకున్నాడు చూశావా" అంటూ చాకిదగరముంచున్న ఆ అన్యవ్యక్తిని చూపించాడు. "ఆయన నా శత్రు మీద దేవుడు" అన్నాడు

"అయితే యేటంటాడు"

"పావలో పరకో తెక్కంటాడు అలా కాక పోతే, నీ యునకాలే వచ్చేంది చూడూ, అకంటను యింకాలే తీసుకు రమ్మంటున్నాడు" అన్నాడు ప్రశాంతంగా

వాకుల భయపడిన కోడిపిల్లలా వెంకమ్మ వణకాలగుంది

"అడిజమ్మకు! యీదక!" అంది వెంకమ్మ ఉద్రేకంతో ఆశహ్యస్తగా అంత చటుక్కున తిట్టినందుకు పశ్చాత్తాపపడింది కళ్ళంట నీళ్లు తిప్పతూ.

"నీకు తెలీని వంగగేముంది బాబూ మేంకూడా నీలాంటోళ్ళమేనా సెప్ప రెక్కాడితేగాని డొక్కాడదు. యీ కట్టమంతా పడితే ఓపావులా మిగుల్తుందో మిగలదో, దారిపాడుగుబా పతీవోడూ ఓ పావలా గుంజుకుంటే మా బతుకు లేంగాను ఆ గుంజేయన్నా వాపిల్ల గవకా నీ యింట వంపడానికి అడిగేవా సిగ్గలే దంటూవా అలా సెప్పడానికి?"

"మెుసెట నే వల్లరి పెట్టావానిన్ను యేకో ఓ పావలా పారేసి మా గూజాన మిగుపాండి అది ఆడి మొగాన పారేస్తా." అన్నాడు చాకిదాను పామదూరి దూరకంగా వెంకమ్మకూడా రొంటనున్న పావలా తీసి వాడిచేతిలో ఉంచింది. వాడది తీసుకొని—

"యిదిగో ముసలమ్మా! యింకముందు మీరి విశ్వం మాటెట్టుకుని యీదానిన్నొస్తే జైల్లో పడి పోతారు లేకపోతే ఆయన చెప్పినట్టు పేర్లెంపెకల వింటే నా పేరున్లో యేంలేగు తిరక్కి మాయిట్టం" అన్నాడు తీవ్రంగా

"అయితే మా బతుకులు పోయినట్టే యీ శాక గంజికూడా తాక్కుండా పస్తుండాలి" అంది దీనంగా వెంకమ్మ

"అయితే ఆయన చెప్పినట్టు చేసుకోండి" అన్నాడు విసుగ్గా

"ఆనా యేనా పేత్తాంబాబూ సూకు మాలరం గావణం చెరాయేటి"

"మాయటం చేసేం చివ్వగన్నా అయినా యిదివరకు లాగే అపాలాలదారిని పొండి, ఎవరూ అడ్డేవాడుండెదు కొత్తిమారమయితేనేం" అన్నాడు.

వాడు మాటాడకుండా ఆ పావలాఅతని చేతిలో పెట్టాడు కోపంతో ఆ అధికారి చేయిమీద విసిరి కొట్టి "హారి మెుద్దూ! మన పగవుతీశావురా పావలా యిస్తేపుచ్చుకున్నానవూ?" అన్నాడు

"అంతే ఇచ్చారండి నిజం చెబుతున్నాను."

"నాకే తులకి యిస్తామనిమాస్తన్నావూ? ఎవడి దగ్గరోయి యీ పానిపేమాలు వాళ్ళదగ్గర యెక్కువ డబ్బులాగేసి, పావలాఅన్నమాట వానోగజారించని ఆ పావలా నాకిస్తున్న కొడుకున్నావ" అని గద్దించాడు.

'లేదండిబాబ్ లేదండి" అన్నాడతను జడిసి చేతులు నలుపుతూ

"ఏం లేదు? నువ్వు పుచ్చుకున్నావు ఎంతిచ్చారు నిజం చెప్పు?" అంటూ ఉరిమాడు

అధికారం దుర్వినియోగం చేసేవ్వాడు మాన వునిలో మానవత్వం నశిస్తుంది.

"నిజంబాబ్—నిజం. వాళ్ళిలతో దుగా చెప్పన్నాడు పావలా ఇచ్చారు. అంతేనండి" కళ్ళంట నీళ్ళు పర్యంతం తెచ్చుకుని అన్నాడు.

## పెద్దమనిషి

అంటూ ఆమె భుజంమీద మెల్లిగా చేయివేశాడు. నాగులు ఉలిక్కిపడి వెనుతిరిగి చూసింది. కన్నీళ్లు కారుతున్నాయి. ముసలాయన మొహంలో చిరునవ్వు వెలుగుతోంది.

ఆమె హఠాత్తుగా తన నడక వేగాన్ని అధికం చేసింది. ముసలివాడి చేయి తెగిన సంకెలలా జారి పోయింది. అతనికూడా కాస్త తొందరగా నడిచి ఆమె ప్రక్కకు చేరి "అంత పరిగెడుతున్నావేం?" అన్నాడు.

"బండికి టైం అయింది బాబూ" అంది.

"నేనూ వస్తున్నాను" అంటూ మెల్లిగా మళ్ళీ చేయి జారవేశాడు ఆమె వంటిమీద.

నాగులు కా పెద్దమనిషి అగస్థ అంతా అర్థ మయింది. మానవత్వాన్ని కత్తితో పొడిచినట్లయింది. అతనిమీద ఏ అభిప్రాయమున్నా గౌరవం పోయింది. కొంత దీనే యీక్షణంగు యిలాంటి దుశ్చేష్టలు చేస్తా డేమో అనుకుంది. వివాహమయిన ఆమె ముఖం లోంచి గొప్ప మందహాసం వెలువడింది, దట్టంగా అల్లు కున్న వలయమ్మునుండి తొంగిచూచే కుసుమాలాగ. పెద్దమనిషి మృదువైన ఆమెభుజం నెమ్మదిగా నొక్కాడు. ఆమె మళ్ళీ జాగ్రదవస్థలో ప్రవే శించింది. మెల్లిగా అతనిచేయి తనచేతితో తీసింది. వృద్ధుడికి ఒక్కసారి కోపం వచ్చింది. అయినా అంతకోపం ప్రకటించడం మంచిదికాదని తొటపటుతో చింది. "ఆఁ! జాణ నేను తోడుపడకపోతే నీపనేమయి ఉండేదో తెలుసా" అన్నాడు.

"మీ శ్రేయం బాబుగారు చాలా ఉపకారం చేసి నారు. మీ పేరు ఈ జన్మలో మరచిపోను" అంది నాగులు.

"మీలాంటివాళ్ళంతా మాటలతోటే పనులు దక్కించుకుంటారు" అన్నాడు తొందరగా నడిచి ఆమె పక్కకుచేరి.

"నిజ్జంగా చెప్తున్నా బాబయ్యా! తమ ఉప కారం నే చెప్పుడూ మర్చిపోను"

"నువ్వు మర్చిపోకపోతే నాకు లాభంఏమిటి?" అన్నాడు.

నాగులేమీ మాట్లాడలేక గబగబ అడుగులు వేస్తూ నడుస్తోంది. అతడు నెమ్మదిగా ఆమె నడుం మీదకు తనచేయి పోనిచ్చాడు. ఆమె తుళ్ళిపడి విసుగ్గా అతనిచేయి విదిలించింది. తీసేసిన గొళ్ళెంలా వేలా డింది అతనిచేయి. జబ్బమీద కాస్త నొప్పిపెట్టింది. తన ఆత్మగౌరవానికి దెబ్బ తగిలినట్టు బాధపడ్డాడు.

"యింతుపకారం చేస్తే యిదేనేమిటి? కొంచె మైనా బుద్ధి ఉండొద్దూ? నీ గురించి ఎంత ప్రతిమా లేమ ఆ దొంగని" అన్నాడు కోపంగా.

ఆమె మాటాడకుండా వేగంగా నడుస్తోంది.

"లేకపోతే యీ పాటికి జైల్లో తోసేసి, దాన గొట్టి తన్నులుమూసి, నీ వంటిమీద అందరూ తలో చెయ్యివేస్తే ఏమౌతుండేది నీకు?" అన్నాడు.

ఆమె నిశ్శబ్దంగా వేగంగా నడుస్తోంది.

"నీ వక్కవిషయాలు, కల్లబొల్లి విషయాలు చూసి విడిచాననే అనుకున్నావేం పాపం"

ఆమె నోరు కదపలేదు వేగంగా నడుస్తోంది

"దయాగుణము యిలాంటి వాళ్ళమీద దయ చూడాను ఇంత సహాయంచేసినా సరే"

ఆమె మాట్లాడలేదు. గట్టించిన వేగంతో నడుస్తోంది.

"మాట్లాడవేం కలంకోటిన రాయిలాగ!" అంటూ ఆమెచేయి పట్టుకున్నాడు. ఆమె విదిలించు కుంది. అతడు యింకా గట్టిగా పట్టుకున్నాడు. ఆమె యింకా గట్టిగా విదిలించుకుంది. ఆ ఆగడాను నెత్తి మీద మాటలు యిద్దరిమధ్యా పడ్డాయి. ఆమె గుండె వేగంగా కొట్టుకుంటూంది. మాట్లాడలేకపోయింది. ఆమె అసహాయత ఆధారంగా తీసుకుని ఆమెను దగ్గ రగా లాగుకుంటున్నాడు. ఆమె భయంతో వణుకు తూంది.

వీధి దీపాలుకూడా బెదిరినట్లు వణుకుతున్నాయి. కళ్ళు కోపంతో మెరుస్తున్నాయి. శరీరం బిర బిగుసుకుపోయింది.

"నన్నొదిలెయ్యండి!" అని అరిచింది.

"ఇదిగో యీ పదిరూపాయిలు తీసుకో"

"నా దారిని నన్ను పోనివ్వండి" అంటూ తన చేయి లాగుకుంటోంది. అతడు ఆమెను నొక్కి పట్టుకుని తనవైపు లాగుకుంటున్నాడు. ఆమె తనశక్తి అంతా ఉపయోగించి ఒక్కలాగు లాగింది. అతడు ముందుకుపడ్డాడు. ఆమె బరువుగా ఊపిరిపీలుస్తూ నిలు చుంది. అతడు లేవడానికి ప్రయత్నించేస్తూ కళ్ళంట విస్ఫులింగాలు కురిపిస్తున్నాడు.

"యిదిగో బాబూ! మీ దారిని మీరు పొండి. నన్నులరి పెట్టారంటే గొల్లుపెట్టేసి పదిమందిని కేక పెట్టేస్తాను" అందామె అతడు లేవకముందే.

"గోల పెట్టేస్తావేం" నీ లాంటి దొంగలను సహాయంచేయడం నాదే పొరపాటు" అన్నాడు బట్టలు దులుపుకుంటూ.

ఆమెయీమాటలు చెవికెక్కించుకుని, మాట్లాడ కుండా, అతనివేపు చూడకుండా, గుడ్డిదీపాల వెలు తురులో క్షేమమైపు వేగంగా నడుస్తోంది. అతడు కసుంచిరిగిన తాచుపాములా బుసలుకొడుతూ నడి రోడ్డుమీద నిల్చున్నాడు.

వీధిప్రక్క గుడ్డిదీపాల వెలుగులు దల్లిగా నవ్వు కుంటున్నాయి.

సంస్కృత లక్షణములోని వృత్తిగంధి వచనము పద్య భాగచ్ఛాయాప్రధానము. ఆ పద్యభాగవృత్తమును గణసంఖ్యను కంటె గురులఘుక్రమము గమనార్హము. సప్తసంధానమున కుమారసంభవములో అట్టి వృత్తిగంధి వచనము కలదు. ఆయా ప్రకరణముల ఆయా ప్రభేదములు వక్ష్యమాణములు. ప్రకృతము వచనము రీతిపరముగ అసమాసకము, దీర్ఘసమాసకము అని ద్వివిధమున స్పష్టము. వస్తుపరముగ తెలుగువచనము త్రివిధము 1 కావ్యగతమైన గద్యములు. 2 విప్రకీర్ణకములైన చూర్ణికాదులు 3. ప్రత్యేక వచనగ్రంథములు. అందు మరల అవాంతర భేదములు అనేకము. అది వచనరచనా పరిణామము కలిగిన ఫలప్రావన్యము. ఏతంవిధ వచన పరిణామమునకు సమగ్రాంధ్ర వచన సమీక్షయే కర్తవ్యము.

అసలు పద్యమువలె గద్యము గౌరవప్రదము కాదను దృష్టి కలదు. అట్టి భావన అవిచారిత రమణీయమే. "గద్యమ్ కవీనాం నికషం వదంతి" అని ప్రసిద్ధమైన ఆభాణకము "బాణోచ్ఛిష్టమ్ జగత్సర్వ" మ్మని మించిన కాదంబరియు, "దండినః పదలాలిత్య" మ్మనిపించిన దశకుమార చరిత్రమును వచనకావ్యములే, గద్యగ్రంథములే. పాశ్చాత్యులకును వచనము పరమప్రమాణమే 2 ఎలిజబెత్తు కాలములోని ఫిలిప్ సిడ్నీ పద్యకవితకు ప్రతిభఒత్వము వహించినది వచనరచనములలో మహాకవులు కలరనియే "ఛందస్సులేనా ఉత్తమ కవిత ఉండవచ్చును" అనియే కాల్ రిడ్జి అభిప్రాయము "కావ్యమునకు శ్రుతిలయల వలన కలుగు నిశ్చితత్వము (Certainity) తీవ్రత్వము (Force) నియమితత్వము (Regularity) అను గుణత్రితయము పద్యబద్ధమైన కావ్యములలో స్పష్టీకృతమై, హృదయస్పందకము లైనట్లు వచనములో కుదరగు" అని మేథ్యూ ఆర్నాల్డు వక్కాణించినప్పటికిని "వచనములోను శ్రుతిలయలు కలవు" అనియే సిడ్నీ వాదము. గద్యముకంటె పద్యము గంభీరమన్నది షిల్లర్. అతడు మొదట నాటక కావ్యము గద్యములో వ్రాసి తరువాత పద్యములో వ్రాయగా భావనాభేదమున గద్యరచనము నీరసమనిపించుటే గాక పద్యరచనములో ఆత్మైకపనము కలదని తెలిపిన తరుణకవి. కాని ఆంగ్లేయకవులు మాత్రము శ్రుతిలయాత్మకమైన వచనములో రసప్రసరమైన రచనము చేసి "పండితాః సముదర్శినః" అను ప్రవచనమును అన్వర్థము చేసికొన్న అదర్శకవులు. "పద్యగద్యమయం చంపూరిత్యభిధీయతే"—పద్యగద్యాత్మకమైన చంపూరచనము ప్రత్యేకాంధ్రసంప్రదాయము. కారణము సంస్కృత చంపూకారులయిన అనంతకవి (భారత చంపువు) లక్ష్మణకవి (చంపూరామాయణము) ఆంధ్రులగుటయే. కాదంబరీ దశకుమార చరిత్రలతో పాటు తచ్చంపూగత మనోరమ ఘటనకు ఆంధ్ర సరస్వతికి అధ్యాపకవాణి సంస్కృత వ్యాసముల్లసితమై సహ్యాసనంకనికనిత పైన, విలసిత మైన తెలుగు సాగ స్వతంత్ర వచనములో పద్యగతికల గద్యగతికములు

తెలుగు ప్రాచీనత్వమే అయినప్పటికిని పాలిచ్చి పెంచినవి ప్రాకృతసంస్కృతములు. ముఖ్యముగ సాహిత్యముఖమున ఆంధ్రుల ప్రథమసాహితి గాథాసప్తశతి ప్రాకృతమే. ప్రాకృతము శాతవాహనుల కాలమున రాజభాష. అనాటి హాలుని అర్ధాంగి లీలావతికి సంస్కృతమే లీలావిలాసము. ఆ రాణీగారికి జలక్రీడలలోను గీర్వాణమే! పాపము, హాలునికి సంస్కృతము పాతమనది పలవులనాడు సంస్కృతము పాలకవ్యవహారభాషయే కూడనికొద్ది శాసనము లందును కూడ అట్టి ప్రాకృత సంస్కృతముల ప్రాభవమున ఆంధ్రులదేశభాషకు అనుమతింపక అసలు దేశభాష అగుచిన వాగ్వ్యవహారము ప్రతిభావకు వది ప్రాథమికదశ వాగ్వ్యవహారము వచనమైన రూపము ఆ వచనము అలంకారిక రచనమైనపుడే ప్రత్యేక వాఙ్మయప్రాదుర్భావము వ్యవహారదశయందర్థమానము. వాఙ్మయవచనమునకు వ్యవహారవచనమే ప్రాతిపదిక. ప్రాచీన వ్యవహారవచనమునకు ప్రభువుల శాసనములు కొంతవరకు ఉదాహరణలు. ప్రజాదైనందిన వ్యవహారవచనమునకు ప్రత్యేకవసతి లేదు. ప్రభుశాసనములందే ప్రజావాణి సత్కృతి ప్రతిఫలనము సాధకము. అది వచన రచనా ప్రాథమికదశ. ఉపలబ్ధశాసనములలో ఉన్నది మొదట గద్యము. తరువాత పద్యము. కాని పద్య కవిత్వము తరువాత గద్యకవిత్వము క్రమపరిణామము నిజమే, శాసనవచనము కవిత్వగద్యము కానే కాదు. కేవల పాలక వ్యవహారములోనిది వచనము. శాసనములు వార్తాప్రధానములు. ప్రతీకలకంటె శాసనములలో ప్రత్యేక సంచికలకవితా నీరాజనములవలె పద్యముల పల్లవి సంభవము. కనుక శాసనములలో ప్రథమతః

(2) అముద్రిత సాహిత్య విమర్శనము—పింగళి లక్ష్మీకాంతముగారు.

కనిపించునది వచనము అది మరల ప్రత్యేకము. మొదట పదము. పిదప వాక్యము, తరువాత సమాసరచనము. ప్రాకృతసంస్కృత శాసనపాళికలంగు తెనుగుపదములు కలవు "దేవులను నిలిపిరి" మొదలైనవి ప్రథమతః శిలాశాసనముల పుట్టిన తెనుగు వాక్యములు అనంత కాలి క్రింది శాసనపంక్తులు 3

"స్వస్తిశ్రీ పొలిమహారాజు లొకన ఇచ్చుట కి అగపోతులు రేనాకాలు ముద్దగకాలు ఇచ్చిన పన్నస చెఱ్ఱుకు ఇకోటమిన్ దేనికిచ్చినవారు పంచమహాపాతకసంయుతుస్"

"మహయాశివమ్మంగగా యశివమ్మ వృద్ధిశివమ్మ ఇ ముగ్గురు ఒకరు బోళిచేత కిడగొనిన కట్టకా వెలువరించు సవితిపోతురు పానబోతుము పట్టిముడువ రట్టొల్లు వగ్గిపా ముగన్ని బోతుము ఇన్దఱు దివికి పత్తి"

తొమ్మిదవశతాబ్దికి చెందిన విజయాదిత్యుని సాగ్గవ శాసనము గద్యశైలికి గట్టి కదలించినది. "అనేక యుగశతాలంకృతి సమస్త మహామండల ప్రకాశితకీర్తి" మొదలైన సమాసములు మొదలైనవి అనగా ప్రాకృతప్రాథికము పోయి సంస్కృత సార్వభౌమత్వమునకు స్వాగతము. పండరంగని అద్దంకి శాసనము పద్యగద్య రచన పట్టుబడినది. రెండవ ధర్మవర శాసనము గట్టిపడినది దీర్ఘ సమాస రచనము దీర్ఘకృత పాంగము "విజయాదిత్య పాదపద్మప్రధాన రాజ్యాధిరాజ సమస్త రాజ్యధర నిరూపిత మహామంత్రాధిపతి"— కట్టెపడియాము వాటి శాసనములందు సంగతే 5 "సమరాంగణ దారాతి మత్తమాతంగ ముసోన్నత విదారదారుణ ఖరనఖరపంజర! సామన్త వజ్రపంజర విజభుజ పరాక్రమ విస్త్రత ప్రతిమల్ల పరబల జలనిధి కబళన బడబానలో ద్విగదావానల!"

పద్యశాసనములందును గద్యపంక్తులు కలవు. పండరంగని అద్దంకి శాసనమున (క్రీ శ 858) "పండరంగు పరము మహేశ్వరుడు ఆదిత్య భటారునికి ఇచ్చిన భూమి యొనుబది పుట్ల అష్ట పట్టు పెం దమ్మ పురంబున దమ్మపులు వీని రక్షింపువారికి అశ్వమేధంబున ఫలంబు అగు" వని కలదు యుద్ధమల్లుని బెజవాడ శాసనములో (క్రీ శ 898) "దీనిం కేల్లోలు యొకెడు (వా) రతిరంబేళు (వ) రాణుసాటి గొంగ (లు) మ కెట్టు వేసినగను (జ) ను యా వ్రతి చేసిన వాడు (వా) ర దీనెక్కాడు విల్చిన వాడు (ప్ర)ష

ఙర్చి యుతేశ్రుట పా (పం) బు గాన" అని వచన భాగము ఒక అత్తురాజతి శాసనమున (క్రీ శ 1108) "స్వస్తి సమస్త ప్రశస్తి సహితం శ్రీమన్మహామాణ్డలేశ్వర కుళోత్తుంగచోడ గొంకరాజుల దివ్యశ్రీపాదపద్మోపజీవియైన పెద్ద ప్రోలి నాయకుని పెద్దకొడుకు నాగ్రామణి శ్రీ మదమహేశ్వర మహోత్సవాన కాచంద్రార్కమ్ము కొగముఖంప నఖ్రిడ దీపంబున కిచ్చిన గోరికలు రెం" అని గద్యము.

అర్వాచీనములైన అనేక శాసనము కేవల వచన రచనములు అవిగాక కేవల పద్య రచనములయిన అనేక శాసనములుగును, అంతకంటె కేవల సంస్కృతభాషా రచనములయిన బహుశాసనములుగును, గ్రామనీములు తెలుగు భాగము తెలుగువచనమే. ఆ వచనము అనాటి వ్యావహారిక భాష. అంతేకాదు అలతి వాక్యములు అగాగుగనైనలేని సుదీర్ఘమైన ఏకైక మహావాక్యముగ నుండుట సైలక్షణ్యము. 1480 సంవత్సరమందలి అల్లయ దొడ్డాగడ్డి కొండు దుగు శాసన మిందుకు నిదర్శనము అలతి వాక్యములు అరుగుగ కల మహావాక్య రచనమును కలదు 1484 సంవత్సరమందలి అల్లాడ వేమారెడ్డి వేముచర శాసన మింగుకు నిదర్శనము ఈ రెండు శాసనములు కూడ కేవల సంస్కృత భాషాగ్రథితములే గ్రామనీమలు తెలుగు సందర్భమెంకటె తెలుగు వచనము. బహుశాసనముల కిది సాధారణమైన పద్ధతి ఆ పద్ధతికి అట్టి సర్వశాసనములందును సంప్రదాయమైన ఓక శాప్రాయ శ్లోకమే తీరు.

"అస్యగ్రామస్య సీమానో దితూ పర్యావసు ద క్రమాత్
పర్వేషాం మ్మపటోధాయ లిఖ్యంతే దేశభాషయా"

ఆ దేశభాష ఆంధ్రావనిలో ఆంధ్రమే కదా! ఏత దుదాహరణములు స్థలనిస్తర హేతువులని ఈ పే శతములు ప్రధానముగ నిట పండరంగని రెండవ ధర్మవర శాసనమునందలి సమాసరచనము గమనార్హము.

---

3. నన్నయకుపూర్వము ఆంధ్రభాష—మలంపల్లి సోమశేఖరశర్మగారు ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచిక. కృష. పుటలు 5-16

4 అముద్రిత సాహిత్య చరిత్ర — డాక్టర్ శ ని ఆర్. నరసింహంగారు.

5. భావాలిశాసనము—గంటిజోగి సోమయాజి గారు పుట 149

# దివ్యదీపావళి

శ్రీ ఉత్పల సత్యనారాయణాచార్య

ఇదిగో! దీపము లెల్ల వెల్గె నిపు డింటింటన్ గవాక్షమ్ములున్
వివృతంబైనవి, సర్వమానవ మనో వీథీ సుహృద్భావ గౌ
రవ మవ్యాహత దివ్యదీపకళికాలంకారనీరాజనో
త్సవమై పర్వెను దిగ్దిగంతర పరీత శ్రీవిరాణ్మూర్తికిన్.

ఏ యింట వెలిగిన నేమి యీ దీపంబు
లింటింట నొక కాంతియే రహించె
ఏ చోట బుట్టిన నేమి యీ పసివాడు
సర్వ మానవ సమాజమ్ము వాడె
ఏ పాట బాడిన నేమి యీ దినమున
ధ్వనియించు నాత్మైకతత్త్వం బొకండె
ఈ రోజు నా యింటి ద్వారాలు దెఱతు నా
హూతులకును ననాహూతులకును

రండు! మీ కందఱకు సోదరుండ నేను
వ్యక్తిగతమొల్ల నేడు ప్రాపంచిక మ్మొ
నర్చి సేవింతు నా జగన్నాథదేవ
పూర్ణ మంగళాలంకృత స్ఫూర్తి మూర్తి!

ఎచ్చట నీదుపుత్రులు సహింపగరాని దరిద్రతాభరం
బచ్చగ మోయుచుండ్ర్ ధన మదాంధులచే నవమాన్యులయ్యు ని
ప్పచ్చరమైన యా బ్రతుకు బాటల దివ్వెలబారు దీర్చిరో
అచ్చటికే జగమ్మును దయాపరతన్ దరలింపుమా ప్రభూ!

ప్రాయపడ్డారు. ఛాందోగ్యోపనిషత్తు హృదయనిర్వచనం ఈ విధంగా ఇచ్చింది "హృది, అయం, ఇతి, తస్మాత్, హృదయం" ఆత్మ ఇందులో నివసిస్తున్నాడు కనక హృదయమైనది. ఇది ఒక అర్థం. సమస్త ప్రాణములు హృదయంలో ఉన్నవి కనుక హృదయం ఇది రెండవ అర్థము. కఠోపనిషత్తు హృదయంలో 101 నాడులున్నవని, ఇవి శరీరమంతటా వ్యాపించి, శరీరమును నడుపుచున్నవనీ చెప్పుతున్నది. ఇది శరీరమునకు మూల స్థానాలు. సూర్యుడు హృదయంలో ఉన్నాడు. ఇతని ప్రకాశమే ఇతరత్రా వెలుగునిస్తున్నది. తైత్తిరీయోప నిషత్తులో హృదయమును గురించి విపులంగా చెప్పబడింది. కంఠమునకు క్రిందుగా నాభికి పైగా హృదయపద్మం ఉన్నది. ఇది అధోముఖంగా వేళ్ళాడుతున్నది. దీనిలో విశ్వవ్యాపియైన పరమాత్మ ఉన్నాడు. ఈ హృదయం మధ్యలో సూక్ష్మమైన రంధ్రమున్నది. దానిలో పరమాత్మ ఉన్నాడు. ఇక్కడ అగ్నిజ్వాల ప్రకాశిస్తున్నది. ఇది నల్లని మేఘముల మధ్య మెఱయు మెఱుపుతీగవలె ప్రకాశిస్తున్నది. ఇది సన్నని కాంతి గలదిగాను, వరిముల్లువలె సూక్ష్మమైనదిగాను స్ఫురిస్తున్నది. దీనికి ఉపమానము ఏదీ లేదు. దీని మధ్య పరమాత్మ ఉన్నాడు. ఇతడే బ్రహ్మ విష్ణు మహేశ్వరులు. సమస్తము ఇతడే. మహోపనిషత్తులో ఈ విధంగా ఉన్నది.

"సంత్యజ్య హృద్గుహేశానం దేవమన్యం ప్రయాంతి యే
తేరత్న మభివాంఛంతి త్యక్తహస్తస్థకౌస్తుభాః"

హృదయగుహలోని ఆత్మదేవుని తెలిసికొనలేక ఇంకెక్కడో భగవంతుడున్నాడని అనుకునేవారు, చేతిలో ఉన్న దివ్యరత్నమైన కౌస్తుభమణిని వదిలిపెట్టి, సామాన్యరత్నమును వెదకువారివలె ఉన్నారు.

మనకు రెండు హృదయాలున్నవి. స్థూల హృదయం మొదటిది సూక్ష్మహృదయం రెండవది. స్థూల హృదయం ఒకవైపున, సూక్ష్మహృదయం ఇంకొక వైపున ఉన్నది.

నేను, నేను అంటూ ఆత్మహృదయంలో పుట్టేదని రమణమహర్షి తమ అనుభూతి వెల్లడించారు. పరమాత్మ ముఖము సువర్ణమయపాత్రచే మూయబడి ఉన్నది. దీనిని ఈశావాస్యోపనిషత్తు ఇట్లా చెప్పుతున్నది 'హిరణ్మయేన పాత్రేణ సత్యస్యాపిహితం ముఖం' సాధకుడు, ఈ బంగారుపాత్రను తొలగించాలి. అప్పుడక్కడ పరబ్రహ్మ సాక్షాత్కరిస్తాడు. ఆత్మజ్ఞానస్వరూపి అందుకే ఉపనిషత్తు ఈ విధంగా అంటున్నది

'ఆత్మజ్ఞానస్వరూపి, ప్రాణంలోను, హృదయంలోను ప్రకాశిస్తున్నాడు. కనక ఆ పరమాత్మను సచ్చిదానందుడని పేరు వచ్చింది. సత్, చిత్తు, ఆనందముగుడు సత్యజ్ఞానానందమయుడు. ఆనందో బ్రహ్మ అని ఉపనిషద్వాక్యం. ఆతని దర్శనం వల్ల బ్రహ్మానందం కలుగుతున్నది. బ్రహ్మానందం ముందు ఇంద్రియానందము, సూర్యునిముందు దీపం వంటిది. ఇటువంటి బ్రహ్మానందము, జ్ఞానము, సత్యము హృదయంలో ఉన్నవి. దీనిని తెలుసుకోలేక, ఆనందం ఎక్కడో ఉన్నదని వెదుకుట అజ్ఞానం. సచ్చిదానందుని సన్నిధిలో రెండు లక్షణాలున్నవి. 1 జ్ఞానమయము లేక జ్యోతిర్మయము, 2 ఆనందమయము లేక రసమయము. ఆనందములేని జ్యోతి సూర్యునివంటిది. జ్ఞానములేని రసము చంద్రునివంటిది. సూర్యుడు వెలుతురు ప్రసాదిస్తాడు, చంద్రుడు ఆనందం ప్రసాదిస్తాడు. జ్యోతిశ్శాస్త్రము రవిని ఆత్మ అనీ, చంద్రుడు హృదయమనీ చెప్పుతుంది.

సాధకులలో 2 రకాలవారున్నారు 1 వేదాంతి లేక జ్ఞాని, 2 కవి. సూర్యజ్యోతివల్ల ఆత్మజ్ఞానము కలుగును. ఈ విధంగా ఆత్మజ్ఞానం పొందినవానికి జీవితరహస్యములు కరతలామలకము లౌను. ఇతని వేదాంతి అంటాము. చంద్రుని రసమయతవల్ల, మానసికాహ్లాదం కలుగుతున్నది. ఈ విధంగా ఆహ్లాద లబ్ధి అయిన వ్యక్తి సామాన్యుల కందని ఆనందమును అనుభవిస్తాడు. ఇతనిని కవి అంటాము. కవి ప్రకృతిలోని రసమయరహస్యములు ప్రజలకు పంచిపెడుతున్నాడు, వేదాంతి ఈశ్వరుని జ్ఞానరహస్యములు ప్రజలకు పంచిపెడుతున్నాడు. కవి, వేదాంతి హృదయసాధకులే. కవి ఋషి అని వేదములు చెప్పుచున్నవి. హృదయానందుని దర్శించని వాడు కవి కాజాలడు. పరమాత్మ ఉన్నత శిఖరము అధిరోహించిన వారిలో అహంత నశించి ఉంటుంది. అతని ముంగున్నది ఏకత్వం. అంగుళల అతడు విశ్వమానవుడౌతాడు. సమస్తలోక కళ్యాణమే అతని ప్రయత్నం. ఆ ప్రయత్నమును కవి తన కావ్యంలో ప్రవేశపెడుతున్నాడు. కనక నే విశ్వశ్రేయస్సు కోరని కావ్యం కావ్యం కాదంటాను. మహాపారమార్థికమైన నవలా రచయిత టాల్‌స్టాయ్ మహా నవలాకారుడని అంగీకరించలేను. విశ్వసహోదరభావం చూపించలేనివాడు నవలాకారుడు కాడని టాల్‌స్టాయ్ భావము. కళలో ఎంత రసమున్నా, విశ్వప్రేమ లేకపోతే ఆత్మ లేని శవం వంటిది. భారతీయ మహాకవులందరూ విశ్వశ్రేయస్సుతోనే కావ్యములు రచించారు. వ్యాస వాల్మీకులు మహాతపస్సుచేసి, సత్యదర్శనం పొందారు. వారు దర్శించిన సత్యము, జ్ఞానము ఆనందము తమ మహాకావ్యములద్వారా ప్రపంచమునకు పంచిపెట్టారు

# సూఫీ దృక్పథము

పరమాత్మ హృదయంలో ఉన్నాడని, పైన తెలుసుకున్నాము. దాని దానికి హృదయమే స్థానము. అక్కడ అంతర్వాణి సర్వదా వినిపిస్తున్నది. భ్రూమధ్యంలో అంతర్జ్యోతి కనిపిస్తుంది. భ్రూమధ్య దేశానికి లోపల మూడుగల కేంద్రమున్నది. కనుక దీనిని తృతీయనేత్రమన్నారు. హృదయంలో వినగలశక్తి ఉన్నది. దీనిని తృతీయకర్ణమని అనవచ్చునని నా అభిప్రాయము. చెవులు ఎందున్నా ఈ శబ్దం వినలేరు. పరమాత్మ వాక్కే గాక, సమస్త జగత్తునుండి శబ్దము వినగలస్థానం హృదయం. ఇది టెలిఫోన్ యంత్రంవంటిది. బాహ్యమైన సమస్తేంద్రియాలు నిగ్రహించి మనస్సు హృదయంతో మేళవిస్తే చాలు. రేడియో శబ్దం వినిపించినట్లుగా అక్కడ వినిపిస్తుంది ఒక దివ్యనాదం. మహాత్మా గాంధి అంతర్వాణిపై వ్యాసం వ్రాశారు. తమకు అంతర్వాణి వినిపిస్తున్నదనీ, సాధనచేస్తే అందరికి అది వినిపించునని అన్నారు. పతంజలి యోగసూత్రంలో "హృదయే చిత్తసంవిత్" అని ఉన్నది. హృదయమందు ధ్యానించిన యెడల, తన చిత్తమునందలి విషయములూ, పరుల చిత్తములందలి విషయములు తెలియునని దీని భావము. అనగా హృదయధ్యానంవల్ల తనలోని అంతర్వాణియే కాక, ఇతరుల ఆలోచనలు కూడా వినవచ్చునని అభిప్రాయము. ఇందువల్లనే బ్రహ్మానంద స్వామి "సుఖాన్ని కోరునప్పుడు పరిశుద్ధహృదయమే సుఖ"మని ప్రవచించాడు.

మానవునికి, భగవదాదేశం హృదయంద్వారా స్ఫురిస్తున్నది. ఏదైనా చేయకూడనిపని చేయునప్పుడు హృదయం చెయ్యవద్దని వారిస్తుంది. ఏదైనా శుభం రానున్నప్పుడు, కారణం తెలియకుండానే హృదయం ఆనందోత్సాహమౌతుంది. మంచిరానున్నప్పుడు హృదయం శరదృతువులో నిర్మలాకాశంవలె ప్రశాంతంగా ఆనందమయంగా ఉంటుంది.

సూఫీలకు ఈశ్వరుడు జ్యోతిస్వరూపి. ఈ జ్యోతి ప్రకాశవంతమైనది, పరిశుద్ధమైనది, నీడలేనిది, జ్యోతులన్నిటికి జ్యోతియైనట్టిది. హృదయధ్యానతల వంతీకాముకులని అంటారు. క్రైస్తవమతంలో వీరిని మర్మవాదులంటారు.

ఏల్ యూనివర్సిటీలో 40 ఏండ్లనుండి హృదయశోధం పరిశోధిస్తున్నారు. హృదయంలో వైద్యుత జ్యోతి ఉన్నదని ఇంతకుపూర్వమే కనిపెట్టారు. దీనిలో ఇంకా అనేకాద్భుత రహస్యము లున్నవని ప్రచురించారు.

## మౌనము

హృదయ ధ్యానమునకు ప్రార్థన, నామజపము, స్మరణ, మౌనము సాధనలు. నామజపంకన్నా, స్మరణ చాలా శ్రేష్ఠమని సూఫీలభావన. మౌనము రెండు విధాలు (1) శారీరకమౌనము, (2) మానసికమౌనము. మాటాడకపోవడం ఏకాంతవాసం. శారీరకమౌనము ప్రథమసోపానము. దీనికి మానసికమౌనమే గమ్యస్థానం. మౌనమే ఈశ్వరుని వాక్కు. మౌనమనగా శూన్యం కాదు. మౌనము తెల్లకాగితం వంటిది. భగవంతునికి రూపం ఉన్నది, అలాగే రూపం లేదనికూడా అనవచ్చును. భగవంతునికి రూపం ఉన్నది, కాని అది మనం అనుకునే రూపంవంటిది కాదు. భగవంతుని రూపంగురించి ఉపనిషత్తులలో ఒక చక్కని కథ ఉన్నది. బ్రహ్మ ఎటువంటివాడని గురువును శిష్యుడు ప్రశ్నించాడు. గురువు మాటాడలేదు. శిష్యుడు ఆప్రశ్న మళ్ళీ అడిగాడు. గురువు తిరిగి అలాగే అట్లే మౌనంగా ఉన్నాడు. శిష్యుడు మళ్ళీ ప్రశ్నించాడు. గురువు 'నీ ప్రశ్నకు జవాబు చెప్పుతునేఉన్నాగా?' అన్నాడు. ఉపనిషత్తుల అర్థం గ్రహించాలంటే జ్ఞాన సంపన్నులై ఉండాలి. అటువంటివారికిగాని అవి అర్థంకావు. విశ్వరహస్యములన్నీ దాచిన సువర్ణ పేటికలవి.

సూఫీముఖ్యులలో దర్గాఖాన్ ప్రముఖులు. వీరు మౌనమునుండి వాక్కు వస్తుందని అన్నారు — అనగా మౌనమనే బంగారమునుండి వాక్కులనే సువర్ణాభరణములు తయారవుతున్నవట. కొందరు భౌతికవాదులన్నట్లు మౌనము సోమరితనం కాదు. వాక్కుకన్న శక్తిగలది మౌనము. ఇందుకే రమణమహర్షి నోటితో చెప్పలేకన్న, మౌనంవల్ల ఎక్కువ చెప్పవచ్చునని అన్నారు.

మౌనం ఎప్పుడు శాంతిమయమై ఉంటుంది. కాని ప్రపంచగోష్ఠులవల్ల అభావమనిలేకుండా ఉన్నాము. దీనినిగురించి చీనావారి గ్రంథంలో ఒకసూక్తి వున్నది 'బురద నీటిని కదిలిస్తూవుంటే, బురద అట్టే ఉంటుంది. కదిలించకుండా ఉంచితే బురద తేరుకుని శుభ్రమవుతుంది.'

మనస్సు బురదనీటివంటిది. దానిని కదిలిస్తూవుంటే ఎప్పుడూ మలినంగానే ఉంటుంది. మనస్సు కదిలించకుండా ఉంటే, అది పరిశుద్ధమై ఆత్మజ్ఞాన సంపన్నమవుతుంది. మనస్సనే బురదనీటిని కదిలించకుండా ఉంచడమే మౌనం. మౌనమనగా ఎటువంటిదో, ముక్తికోపనిషత్తు ఈవిధంగా చెప్పుతున్నది.

'సంత్యక్తవాసనాన్మౌనాదృతే నాస్త్యుత్తమం పదం' సమస్తమైన వాసనలు వదిలి, మౌనంగా ఉండుటే ఉత్తమమైనదని. మౌనియునకు మాట్లాడకుండావుంటే చాలదు. మనస్సులో ఉండే సమస్త వాసనలు ఆలోచనలు, కోరికలు విసర్జించాలి. పతంజలి యోగసూత్రము

# ఆత్మహత్య

శ్రీ మంథా వెంకటరమణారావు

* గత సంచిక తరువాయి *

## రంగము 4

* * మూడోరంగంలో లాగే—తెరలేచే వరికి, గది ఖాళీగా ఉంటుంది పది సెకండ్ల తరవాత రామం 'ఉస్సు' మంటూ వచ్చి కూలబడతాడు కుర్చీలో కొంతసేపటికి డక్టరు సంచితో లోనుండి వస్తాడు రామం లేవబోతాడు.

డాక్టర్ కనుతీసుకో, లేవకు—

రామం (లేచి) బాగానే—

డా॥ నామాటవిని ఒకగంటన్నా నిద్రపో—

రామం అన్నంత సులభమా?

డాక్టర్ ఈ పదిరోజులయి నీ సంగతే నువ్వు పట్టించుకో లేదు—మొన్ననే కదా పడిలేచేవ్?

రామం ఎలా ఉండమంటారు

డాక్టర్ (ఏడు సెకండ్ల మౌనం) నిజానికి మొన్న ఆశంతా వదిలేసుకున్నాను

రామం (తలవూపుతాడు)

డాక్టర్ : ఇప్పుడు ప్రమాదం దాటింది ప్రాణానికేం హానిలేదు

రామం : మరేం చిక్కులేదా?

డాక్టర్ లేదు (రామం కేసు ఒకక్షణం చూసి) కాని ఒక సంగతి

రామం : కళ్ళకేం కాలేదుకద

డాక్టర్ (విచారంగా) అదే అదే

రామం పూర్తిగా ?

డాక్టర్ చెప్పలేను నువ్వు చూసేవ్ కదా స్థితి ఏమీ పోకపోతే అది కేవలం అదృష్టమే.

రామం : అంతేనా!

డాక్టర్ (నిట్టూర్చి) నేనేం చెయ్యను!

రామం (కుర్చీలో కూలబడి, నుదురు కొట్టుకుని) ఇది చాలా అన్యాయం!!

డాక్టర్ అన్యాయమే ఎవరూ బాధ్యులు కారు

రామం (కాస్త ఊరుకుని) నేనే కారణం—

డాక్టర్ నీవా!—

రామం : కమలస్థితి!

డాక్టర్ నీకు మతికూడా పోతోంది—

రామం నేనే కారణం—

డాక్టర్ నువ్వా?

రామం నాకు పరిచర్య చెయ్యబట్టి కమలకీగతి పట్టింది

డాక్టర్ అయితే నీకు రావడానికి ఏమిటి కారణం?

రామం మీరు అలా వాదించి నన్ను శాంతిపరచలేరు..

డాక్టర్ (చికాకుగా) ఇప్పుడు ఇది జరిగిపోయింది. ఏమనుకున్నా ఏముందిలాభం

రామం నా మనసులో బాధ ఎలాపోతుంది—

డాక్టర్ : ఇప్పుడు నువ్వెంత బాధపడ్డా ఒకటే అందువల్ల మరింత నష్టం తప్ప

రామం నష్టమా?

డాక్టర్ నష్టమే. నువ్విలా బాధపడి మనసు పాడుచేసుకుంటే ఆవిడగతేంకాను?

రామం మరింక దాని గతేముంది? సంతోషమంటూ ఉంటుందా దానికి?

డాక్టర్ నువ్విలా అధైర్యపడితే నే ఏం చెప్పను

రామం ధైర్యం ఎక్కడిది?

డాక్టర్ ఒకచోట ఉంటుందా? నువ్వు తెచ్చుకోవాలి అది నీ మనసులోనే ఉంటుంది.

రామం ధైర్యం వచ్చాక? ఏం చెయ్యడం? ఏమీ లేదు.

డాక్టర్ : అదిడికి సంతోషమంటూ లేదన్నా కే, అదిడికి ధైర్యమూ, సంతోషమూ రెండూ ఇవ్వగల గాలి

రామం అది సాధ్యమా ?

డాక్టర్ : సాధ్యం కాకపోతే లోపం నీది

రామం (ఆలోచించి) కాను . (లేచి ఆవేశంగా) నే తప్పు చేస్తున్నాను (ఆవేశం తెచ్చుకుని) ఇలా అన్నా ఋణం తీర్చు కుంటాను ! కమల పోషారి చూచివస్తాను ఎందుకనకండి నాకిప్పుడు ధైర్యం కావాలి

(రామం లోనికి వెళ్ళగానే సరోజ వస్తుంది)

సరోజ నమస్కారం .

డాక్టర్ నమస్తే

సరోజ ఎలా ఉంది డాక్టర్ గారూ ?

డాక్టర్ ప్రమాదం దాటింది

సరోజ (ఎదురుగా గోడకి ఉన్న దేవుడి పటానికి నమస్కరించి, కుర్చీలో కూచొని, కళ్ళొత్తు కుంటుంది)

డాక్టర్ మీరు ఇట్టే రావడం మంచిది కాదు-

సరోజ : నాకేం భయం లేదు

డాక్టర్ మీకు భయం లేనంత మాత్రాన రోగం మిమ్మల్ని చూసి భయపడుతుందా ?

సరోజ : రావాలని ఉంటే ఎక్కడున్నా వస్తుంది-

డాక్టర్ మన జాగ్రత్తలో మనం ఉండడం మంచిది.

సరోజ ఎన్నాళ్ళు పడుతుంది కోలుకుందుకి ?

డాక్టర్ . మరో నెల్లాళ్ళు

సరోజ : (పది సెకండ్లు ఊరుకుని) డాక్టర్ గారూ కొంత కాలానికన్నా కమల ఎప్పట్లా నే

డాక్టర్ నేనేమీ చెప్పలేను చూడనే చూసేరు

కదా ఎంత తీవ్రంగా వచ్చిందో ఈ వికి

సరోజ ఏమన్నా ఆశించవచ్చునా ?

డాక్టర్ నేనేమీ చెప్పలేను కళ్ళ సంగతికూడా అనుమానంగానే ఉంది

సరోజ (లేస్తూ) కళ్ళా !

డాక్టర్ (జాలివస్తున్నట్టు తలఊపుతాడు)

సరోజ (కూలబడి) అయ్యో కమలా ! (చీర చెరగు అడ్డుపెట్టుకొని వెక్కిబెంగా ఏడుస్తుంది )

డాక్టర్ : కరడుకట్టిన నాకూ ఎంతో బాధగానే ఉంది . ఎంత చలాకీవన పిల్ల (ఊరుకుని) ఇలాటివి జరుగుతూ ఉంటాయి ఎవరూ ఏమీ చెయ్యలేరు

(రామం వస్తాడు)

డాక్టర్ : (రామాన్ని చూసి) ఇప్పుడామెకి ధైర్యాన్నిచ్చే బాధ్యతల్లా రామంది

రామం (ఒకక్షణం ఊరుకొని) నాలో నాకే నమ్మకం లేదు-

డాక్టర్ : ఈ క్షణం నీకలా అనిపిస్తోంది సావధానంగా ఆలోచించు ఆమెపట్ల నీకర్తవ్యం

రామం : కర్తవ్యమా ! కానా కర్తవ్యముంది-

డాక్టర్ మనకుకి చేసు మందిక్కలేదుకదా

రామం ఏంచేసేందుకూ పాలుపోవడం లేదు

డాక్టర్ : మన్యామెకి అండగ ఉండి, ధైర్యం కలిగించాలి- నువ్వెప్పుడూ తనతోనే ఉన్నానన్న నమ్మకం ఆమెకి కలగాలి

రామం : నాలో కమలకి నమ్మకం లేదనుకుంటున్నారా డాక్టర్ .

డాక్టర్ ఈ సంగతి అతి సున్నితమైనది అవిపె మాన సికంగా బాధపడకమ్మ నీకు తెలుసు నా నోటంట చెప్పించకు అందు కామెకా అను మానం

రామం : ఎప్పుడూ లేదు . ఎప్పుడూ లేదు ఆ మాట కాస్తే నేనే (ఆగిపోయి తల అడ్డుగా ఊచి) ఉఁహుఁ (సరోజవేపు అనుమానంగా చూసి) నువ్వెందుకిక్కడున్నావ్ ?

సరోజ (ఆశ్చర్యపోయి) అదేమిటి రామం !

రామం వినిపించలేదన్నారు !

సరోజ నా మానాన నేవచ్చేను.

రామం రాదు .

డాక్టర్ ఇదేంమాటలయ్యా రామం.

సరోజ ఎప్పుడూ వస్తున్నా కూడా.

రామం ఇంక రాదు నీకేమయినా అయితే ఎవరు పూచీ పడతారు ?

డాక్టర్ హా అదా (నవ్వుతాడు) నిజమే నిజమే

సరోజ మొన్న రాగాలేంది ఇప్పుడేమొచ్చింది ?

రామం సరే సరే మీ ఆడజాతికో నమస్కా రం--మొండిపట్టుపట్టిన దానిగతి అలాఅయింది..

సరోజ . నాకేం అవదు .

రామం: అదుగో 'దానితో' తిక్క తగాల్లి కన్న కుర్యేదో తేరుకుంటున్నావ్ డోనా!

డాక్టర్: (చిరాకుగా చూసి) సరే. నే ఇంక వెళ్తాను. నే చెప్పింది గుర్తుంచుకో..

రామం (ఇది జ్ఞాపకం వచ్చినవాడిలా అయి) ఉంచు కుంటాను కమల సుఖం కన్న నాకు కావల్సిం దేముంది?

(డాక్టర్ వెళతాడు)

సరోజ: ఎందుకలా విరుచుకుపడ్డావ్?

రామం: నీ కిప్పుడు సంజాయిషీ ఇచ్చుకోవాలా?

సరోజ: (ఊగుకొని) రామం — డాక్టర్ గారన్నది నిజమే?

రామం ఏమన్నాగు?

సరోజ: కళ్ళగురించి

రామం (చిరాగ్గా) నీతో ఎందుకు చెప్పేను?

సరోజ అర్థంలేని ప్రశ్న

రామం అర్థంలేదు!

సరోజ లేదు

రామం నువ్వింక వెళ్ళు దాని కర్థముందా?

సరోజ లేదు.

రామం లేదూ?

సరోజ: లేదు

రామం (కర్చీలో కూలబడతాడు) (సరోజ లోనికి వెళ్ళిపోతుంది) వెళ్ళకు

సరోజ: వెళ్ళను కమలని చూసి—

రామం అక్కడికే, వెళ్ళకు—

సరోజ ఏం?

రామం: నీయిష్టమా నాయిష్టమా?

సరోజ: ఇష్టం అయిష్టం ప్రశ్నలే? చూడటం తప్పా?

రామం: ఎందుకు నీకా క్యూరియాసిటీ?

సరోజ ఇవాళ నీ తత్వం ఎందుకిలా ఉందో అవగతమవటం లేదు

రామం: అర్థం చేసుకుంటే ప్రయత్నించకు—

సరోజ: కమల స్థితి చూడగా అలా ఉంది ఈ నీధోరణికి అర్థమేమిటి?

రామం: ఒకటే అర్థం మాటాడ్డం తప్ప ఇప్పుడు చెయ్యగలిగేదేమీ లేదు

సరోజ: ఈ మాటలు కావు..

రామం పోనీ ఏం మాటాడాలో నువ్వే మాటాడు..

సరోజ అనవసరం

రామం: అనవసరం అయినది ఏదీ లేదు అందుకని నాకుకూడా ఆ మనిషి మానసికస్థితి నిరూపణే

సరోజ సంజాయిషీ ఒద్దులే—

రామం (ఊగుకొని) చెడ్డవాళ్ళని శిక్షించి, మంచివాళ్ళని రక్షిస్తాట్ట దేవుడు

సరోజ నీ మానసికస్థితి నిరూపణే అనుకోవాలా?

రామం: చెప్పను—ఈ విషయంలో ఇది అతీతంలా నిజం

సరోజ (ఆశ్చర్యపోయి, కర్చీలో కూలబడి) ఎవరా చెడుమనిషి కమలా?

రామం (తెంపలు వేసుకుని) నేను

సరోజ నీకేమయింది?

రామం ఇంకేమవాలి?

సరోజ ఔను నీకేమయింది?

రామం ఏమీ అర్థంలేదా?

సరోజ నీకేమీ కాలేదు — బాధ పడుతున్నది కమల

రామం అంతే అంటావా?

సరోజ అంతే

రామం నీకు మనసు లేదు

సరోజ ఎలా పోల్చేవ్?

రామం నే ఎంతబాధపడేదీ గ్రహించలేకపోయేవ్

సరోజ క్షమించు రామం నువ్వుబాధపడుతున్నావ్ నాకు తెలుసు కాని శిక్ష అనుభవించేది కమల కాదూ?

రామం: డాక్టరన్నదే అయితే నేను శాశ్వతంగా ఆబాధ పంచుకోవాలా ఒద్దా?

సరోజ (ఆశ్చర్యపోయి) ఏమిటి? నువ్వంత. !

రామం నేను ఏమిటి?

సరోజ (ముగ్ధగా చూసి) ఇంత స్వార్థపరుడవనుకో లేదు

రామం (ఆవేశంగా లేచి) ఏమిటంటున్నావ్?. నేనా? ఎలా? చెప్పగలవ్ చెప్పు? కమలని నా ప్రాణసమానంగా చూసుకుంటున్నాను కమల బాధ నాబాధ కాదూ? అందుకు నేను స్వార్థ

పరువా? నీకేదే అభిప్రాయం ఉందన్నమాట. ఇదివరకల్లా నా మొహంముందర దానికి అవకాశం దొరకలేదు ఇలా అవకాశం దొరికిందని నువ్వేదో అపోహలో ఉన్నావు సరోజా కమలే నాకిన్ని కమల ఋణం ఎలా తీర్చుకోను!

సరోజ తప్పు మాటంటే క్షమించు రామం అంత ఆవేశపడి నోరు పెట్టకు — నేనేం అపోహ పడలేదు పాత నాటకమంతా అనకు — నాకు చిరాకు

(లేచి గదిలోకి వెళ్తుంది)

రామం నాటకమా? నాటకం నీది నిమా నాటకం నీది

(తల్లి వస్తుంది)

తల్లి ఏమిటూనోరు రామం కమల మగతగా నిద్ర పోతోంది

రామం (తల రెండుచేతులతోనూ పట్టుకుని, ముఖం టేబిల్ కు ఆన్చి) ఈబాధ, చీదర, గాబరం ఇంకా అనుభవించాలా? నేనేపాపం చేసేను!

తల్లి ఏమిటి వాలకం?

రామం వాలకమే — చావ తల్చినవాణ్ణి బతకడం వాలకం కాదూ? బతికి ఈ బాధలన్నీ అనుభవించడం

తల్లి ఏ బాధలు?

రామం ఏమీ లేదు. నీకర్థం కాదు

తల్లి : ఎప్పుడూ పొరపాటున్నా అలా అనకు . కమల చెవిని పడ్డాయంటే (కళ్లొత్తుకుని) పిచ్చితల్లి . దేవుడిని రాతిమనసు దానికి కష్టాలా?

రామం: నేనేకదమ్మా కారణం?

తల్లి : నువ్వా!?

రామం: నాకొరకిచ్చి చెయ్యక చావనిచ్చి ఉంటే ఈ బాధలేవీ ఉండకపోను కదా?

తల్లి · అనుబాబు అను. తెలిసింది అన్నమాటలకి నేనేం జవాబు చెప్పను?

రామం (ఆలోచించి) మరోలా అనుకోకమ్మా. ఏదో చిరాకుగా ఉండి అనేసేను

తల్లి : (కళ్లొత్తుకొని) నాకు తెల్సురాబూ దానిమీద నీకెంత ఆపేక్షో. నాకు తెల్సు. ఇవ్వాళ్లా తిండీ నిద్రాలేక దాని మంచం ఎక్కి కూచున్నావే

రామం ఎక్కడా వ్యాఘుంలేదు ఏం చేసిందని

తల్లి : నువ్వే ధైర్యం వదులుకుంటే నామాటేం చెప్పేవ్ బాబు — నా గుండె తరుక్కుపోతోంది.

రామం: నువ్వేమీ బాధపడకమ్మా అంతా నే చూసుకుంటాను

తల్లి · అలా నే కానీ బాబు కాని నువ్వేం పిచ్చి పిచ్చిగా ఆలోచించకు దాని బాధ చూడలేక నీకలా అనిపిస్తుంది

[తల్లి వెళ్తుంది రామం చిరాగ్గా ముఖంపెట్టి ఆలోచనలో పడతాడు — ఒక నిముషం గడుస్తుంది ఎక్కడినుండో ఒక ప్రేమగీతం రికార్డు వినవస్తూ ఉంటుంది సరోజ వస్తుంది]

రామం చూపవ మంటుందా?

సరోజ ఊం —

రామం ఏంచేంటి చూసేవ్?

సరోజ ఏంచేంటి చూస్తాను? కమలని

రామం ఎలా ఉంది

సరోజ నిద్రపోతోందిలా ఉంది —

రామం కూచోవు?

సరోజ నే వెళ్లాలి

రామం జరూరు పనేమన్నా ఉన్నాయా?

సరోజ టౌన్‌హాల్లో ఏదో 'పెర్ ఫారమెన్సు'ంది — నాకసలు వెళ్లాలని లేదు నిర్మల మొండికేస్తే కూచుంది

రామం ఓహో ఈసంగతులే మర్చిపోతున్నాను.

సరోజ (కూచుంటూ) మనసుకి శాంతిలేనప్పుడు ఎవరికన్నా అంతే

రామం (నిట్టూర్చి) మనిషికి వినోదాలు అవసరమన్న సంగతే మరిచిపోతున్నాను

సరోజ మనసుకి శాంతిలేనప్పుడు ఎవరికన్నా అంతే.

రామం టౌన్‌హాల్ లో పెర్ ఫారమెన్సుందా?

సరోజ ఉంది

రామం ఏం పెర్ ఫారమెన్సు?

సరోజ వోకలు. చిన్న నాటిక

రామం ఏ నాటిక?

సరోజ: గుర్తులేదు.

## రంగము: 5

[అంతా నాల్గోరంగంలానే— రామారావ్ కుర్చీలోకూచొని చదువు కుంటూ ఉంటాడు. కమల తడుము కుంటూవస్తుంది.. ఆమె ముఖం నల్లగా మారింది—ముఖంలో మునుపటి కళా కాంతులు పోయేయి]

కమల ఏమండీ

రామం (లేచి త్వరగా వెళ్ళి ఆమె చెయ్యి అందుకొని) అమ్మ లేదూ?

కమల పిన్నిగారింటికి వెళ్ళేరు.

రామం నన్ను పిలవరాదూ?

కమల: అలవాటు చేసుకోవద్దూ

రామం: క్రమేపీ అలవాటవుతుంది – తొందరేం?

కమల మీకు పని కల్పించడం నాకిష్టం లేదు

రామం నిజం చెప్పేవ్ అలాటి పొరపాటు ఇకనెప్పుడూ చెయ్యబోను

కమల ఎన్నాళ్ళు చెప్పండి

రామం ఎన్నాళ్ళయితే అన్నాళ్ళు రానురాను నీ కలవాటయి పోతుంది ఇంట్లో ఏ వస్తువెక్కడుందో కూడా తెలుస్తుంది వంటకూడా చేసి పెట్టగలవ్ (నవ్వుతాడు)

కమల నవ్వకండి నే అంతపనీ చేస్తాను

రామం చెయ్యలేదనా. ఈ కుర్చీలో కూచో

కమల ఒద్దు మీరు కూచోండంలో నన్ను మీపాదాల దగ్గర కూచోనీండి—

రామం: నీ ఇష్టం (కుర్చీలో కూచుంటాడు ఆమె కిందని కూచుంటుంది కొంతకాలం మౌనం) కమలా

కమల: ఏమండీ?

రామం: నీ దుఃఖాలోచనలు తగ్గేయా?

కమల: (నవ్వి) తగ్గకపోతే మీ రూరుకుంటారా!

రామం: (కమల చెయ్యి తీసుకొని, నీ సంతోషమే నాక్కావల్సింది

కమల మీకు నామీద అంతదయ ఉండగా సంతోషం కాక ఏముంటుంది నాలో..

రామం: జరిగిపోయినవన్నీ మర్చిపో సుఖం కొత్తగా కాపురం పెడ్దాం అనుకో.

కమల మనసూ మీ కళ్ళు

రామం: కాదు – పాత రామం లేడు – పాత కమలా లేదు ఇకనంతా తృప్తి. సంతోషం తప్ప కలతలేమీ లేవు ఎప్పుడూ ఇలానే ఉంటుంది

కమల అంతకన్న ఏం కావాలి నాకు! నే మీకు భారమనిపించకుండా ఉంటే అంతే చాలను కున్నాను

రామం మళ్ళీ మొదలెట్టేవ్!

కమల: కాని నా అదృష్టం పండింది – మీ దయ, ప్రేమ నా కున్నాయి

రామం నే మనిషిని కాననుకున్నావా...

కమల ఎంతమాటన్నారు!

రామం ఇకదీనిగురించి ఆలోచించి మనసు పాడు చేసుకోకు ఊరికే అన్నాను.

కమల (అతని కాళ్ళకి తల ఆన్చి) ఈ కాలంలో దేవుడిలో తక్కువ కుంది! నమస్కారం

రామం: నీకుండా?

కమల బాగా ఉంది.

రామం నీకేమన్నా కావలిచ్చేదా?

కమల ఇచ్చాడండీ

రామం: ఏమిటో

కమల నాకొక్క తక్కువేముంది? మీ మనసుకు శాంతి

రామం (ఉలికిపడి) నా మనసుకు శాంతా?

కమల కాదండీ—మీ మనసులో అశాంతి పోవాలని ప్రతిరోజూ కోరుకున్నాను—అతడికి దయ కలిగింది.

రామం ఇప్పుడు నాలో అశాంతి లేదంటావా?

కమల లేదండీ.

రామం నీకెలా తెల్సు?

కమల నాకు తెలీదనుకున్నారా? మీ మనసెలా ఉన్నదీ నాకు తెల్పిపోదా?

రామం అది కూడా దేవుడిచ్చేడా?

కమల: ముందునుంచీ ఇచ్చేడు.

రామం: ముందునుంచీ నా మనసు నీకు తెల్సా?

కమల తెల్సు

రామం: నా మనసులో ఏమున్నదీ తెల్సా?

కమల: అప్పుడు మీలో అశాంతి ఉండేది.. ఇప్పుడది పోయింది.

రామం: ఎందుకల్లా ఉండేదో. ఎందుకు పోయిందో తెల్సా?

# ఆత్మహత్య

కమల: మీలో నాకు నమ్మకం ఉంది. నాకు బాధ కలిగించే పనులేమీ మీరు చెయ్యరు.

రాము: అదో కోరిక అయినా కాదా?

కమల: నేనేమీ కోరను—అయినా నిశ్చింతగా ఉండగలను మీలో నాకు నమ్మకం ఉంది—

రాము: నీ నమ్మకం చూస్తే నాకు భయం వేస్తోంది.

కమల భయమా! ఎందుకండీ?

రాముం నే ఎప్పుడన్నా పొరపాటు చెయ్యొచ్చు—అప్పుడప్పుడు నువ్వు శాశ్వతంగా బాధ పడొచ్చు

కమల (భయపడుతూ) అంటే మనిద్దరి మధ్యా తెర మళ్లా రావచ్చంటారా?

రాముం పిచ్చిదానా! నువ్వెప్పుడూ చెడు ఫలితాలే కోరుకుంటావ్

కమల: చాలే! తియ్యగా ఉండడం మంచిదికదూ!

రాముం నువ్వు తియ్యగా ఉన్నావా?

కమల దేనికి?

రాము: తెర—

కమల లేవండీ ఎప్పుడూ ఉండలేదు — అది నా భాగ్యం కాదు—ఈసారి నాకింక బతికే అర్హతే ఉండదు

రాముం (నవ్వి) నన్ను చాలా ఇరుకున పడేసేవ్

కమల (ఆత్రంగా) పొరపాటేదయినా అయితే చెప్పండి

రాముం పొరపాటున ఎప్పుడన్నా నీకు తప్పుగా కనిపించే పనేదన్నా చేశానేమోనని ప్రతినిముషం జాగ్రత్తగా ఉండడం ఎంతకష్టం!

కమల అయ్యో! కావాలని జాగ్రత్త వద్దండీ—మీ మానాన మీరుండండి పొరపాట్లే మీ రావు మీ మనసు చూసుకుంటుంది

రాము: నా మానాన నన్నొదిలే కమల—అంటే నేనే పొరపాటూ, తప్పులూ చేసినా నువ్వెప్పుడూ నాకు అడ్డురావనే అది నువ్వు నమ్మ

కమల నేను మిమ్మల్ని నిర్బంధిస్తున్నట్టనిపిస్తే క్షమించండి. నా కెప్పుడూ ఆ అభిప్రాయం లేదు

రాముం నే అనేదల్లా నన్ను అంతగా నమ్మవద్దని నాకు ఊపిరి సలపదు (నవ్వుతాడు)

కమల. మీ ఆత్మలో నాకు విశ్వాసముంది.

రాముం నీత వరించవోకు

కమల మీరు స్వేచ్ఛగా ఉండండి .. మీ ఆత్మ చూసుకుంటుంది

రాముం నీకు చాదస్తం మరీ ఎక్కువవుతోంది

కమల అవ్వొచ్చేమో

(కమల లేస్తుంది)

రాముం నువ్వెక్కడికి?

కమల మీరుంటే అవుతుందా! అత్తయ్య గారెక్కడిది?

రాముం (నవ్వి) నువ్వెళ్లి ఇంక పాయసం చేస్తావా?

కమల నవ్వకండి—కూచోని కూరలు తరిగేసినా గిన్నెలు కడిగి అందించడమైనా చెయ్యొచ్చు కదా! క్రమంగా అన్నీ పనులూ చెయ్యగలను (నవ్వి) మీ ప్రోత్సాహం ఉంటే చెయ్యలేనిపనంటూ ఉంటుందా? వస్తా

రాముం వెళ్లొస్తా ఉండు (లేచి ఆమె చెయ్యి పట్టుకుంటాడు)

కమల: వద్దండీ ఇక్కడికి ఇక్కడికే మీకు శ్రమ

రాముం అన్నా పెంకెతనం!

(ఆమెను తీసుకువెళ్ళి ఒకక్షణం పోయాక ఒంటరిగా వస్తాడు—భారం తగినట్టు నిట్టూర్చి కుర్చీలో కూలబడతాడు—సరోజ వస్తుంది)

రాముం (లేచి, ఉత్సాహంగా) హలో !

సరోజ దారంట పోతూ ఓసారి చూసిపోదామని

రాముం ఏమిటంత హడావిడి ఎక్కడికి?

సరోజ: మామూలే మా మండలి గొడవలు

రాముం (కూచోని బద్ధకంగా ఆవలించి, చిటిక వేసి) ఎవర్ని చూసిపోదామనుకున్నావ్

సరోజ కొత్తిలా ఆ ప్రశ్నేమిటి? కమలని

రాముం (పరధ్యానంగా ఉన్నట్టు నటించి) కమల నా నన్నా!

సరోజ (ఆశ్చర్యపోయి) ఏమిటి

రాము: (ఈ లోకంలో పడ్డటయి) ఏమిటేమిటి?

సరోజ నువ్వు కోరి కయ్యానికి కాలు దువ్వుతావ్ ఏమిటి కారణం

రాముం నిజం ఎందుకొప్పుకోవు. మనం ఇద్దరమే కదా ఇక్కడుంట, ఎవరూ వినిపోతారేమో అన్న భయానికి.

సరోజ (ఉర్కీ లాగ్గాని ఊచాని) నువ్వు నమ్మవ్ నిన్ను చూస్తే కాని, ఉండలేక వచ్చేసనుకుంటావ్

రామం కాదూ?

సరోజ: కాదు నే రోజా వచ్చేది కమలని చూసేందుకే

రామం: అది కోపం అనకో

సరోజ: నే అంత మనసులేని దాన్ననుకున్నావా?

రామం: ఉంది నా మీద—నువ్వు నన్నెంతగా ప్రేమిస్తున్నావో నాకు తెలీదా? నీ మాటలు నమ్మక ఉండను

సరోజ అయినా మోహన చెప్పడం నీకో అలవాటు కింద మారింది. నిన్ను, భరించలేనంతగా ప్రేమిస్తున్నానని నా మనసుని నమ్మించడానికా నీ ప్రయత్నమల్లా?

రామం: నీ సంగతి నిజం కాదా?

సరోజ: నువ్వంటే నా కిష్టం ఉండొచ్చు అలా అని నేను నా ఇష్టానికి లొంగిన అయిపోయేంత దుర్బలను కాను

రామం: అవంతా ఒద్దు నే అంటే నీ కిష్టమా కాదా

సరోజ అవొచ్చు

రామం అది చాలు—

సరోజ ఏంటేంటి నీ ధోరణి—నువ్వంటే నే ఇష్టపడటం నువ్వేదో నీ విజయంగానూ, గొప్పగానూ నా ముందు చాటుకున్నావ్ నీ అహానికది తృప్తినిస్తోంది అది నాకు తెల్సు-కాని ఒకటి నువ్వు తెల్సుకుంటే మంచిది. నీ అహాన్ని తృప్తిపరిచే యంత్రాన్ని మాత్రం ఎప్పుడూ అవను—

రామం: (అగ్గి జాలిగా గొంతుపెట్టి) కోపగించుకోకు సరోజా నువ్వే లేకుంటే నే ఏమవాలి?

సరోజ: (మెత్తబడి) అదుగో ఏమన్నా అంటే జాలిగా ముఖం పెడతావ్.

రామం ఏం చెయ్యను నువ్వు నన్ను ప్రేమిస్తున్నావన్న నిజంలో నా కెంత బలముందో నీకెం తెల్సు తెల్సుకోలేవూ!

సరోజ (మృదువుగా) మనం ఇంక అపసం మంచిదికూ రామం

రామం: ఏది?

సరోజ తెలిసి అనకు—నేను నా దుర్బలతకి లొంగడం కాదే తప్ప

రామం కోప మొచ్చిందా సరోజా

సరోజ కమలని మన మిద్దరం మోసం చేస్తున్నాం. కమల నాకు ఆప్తురాలు నీకు కమలపట్ల—

రామం నా మాటమీద నమ్మకం లేదా? ఎన్నిసార్లు చెప్పినా నమ్మవా సరోజా?

సరోజ: నమ్మకం సులభమా? కమలంటే ప్రాణమంటావ్ కాని ఇతరులకు లేని మమకారం నా మీద నీకు ఏర్పడింది—ఏమనుకోడం

రామం ఇది నువ్వు నమ్మాలి కాని బుజాలు చెయ్యమంటే నే నేం చెయ్యను

సరోజ కమల స్థితి చూస్తూ నువ్వన్నది నమ్మడం కష్టం కదా?

రామం నా ఆర్తిని దంపేసుకున్నానని నీ ఉద్దేశమా?

సరోజ దీని కర్థమేమిటి? కనీసం నా మనసుని తృప్తి పరచుకుందుకైనా ఒక సంజాయిషీ ఉండాలి కదా, నా కెంత స్వార్థమున్నా

రామం (చిరునవ్వు నవ్వి) ఇన్నాళ్ళూ ఏదో లోటు ఉన్నట్టే అనిపించేది ఏమిటో తెల్సేదికాదు. ఇప్పుడు తెల్సుకున్నాను. కమల నా మనసు నువ్వు నా బతుకుని రెండూ లేనిది నాకు పరిపూర్ణత లేదు

సరోజ: (అనుమానంగా చూసి తలదించుకొని) రోజా నా మనసులో ఎంత అశాంతి రేపుతోందో నీకు తెలీదు తెలిసి నే ఎలా మోసం చేసేది కమలని?

రామం: నా మీద నీ కిష్ట ముంది కదా?

సరోజ: ఐతే?

రామం కమల మనిద్దరికీ ఆప్తురాలే ఇందువల్ల కమల మనకి మరింత దగ్గరౌతుంది

సరోజ నువ్వన్నది వేలవంగా ఉంది..

రామం కానీ ఇది నిజం-నా మనసుకు పరిపూర్ణత లేనిదీ నే సంతోషంగా ఉండలేను.. నే సంతోషంగా ఉండక పోతే కమలనా అసంతృప్తికి వేరు కారణాలు తీసి బాధ పడుతుంది—కమల బాధపడటం మనం ఇద్దరం చూడలేం. ఔనా ఔనా కాదా...

రామం అది నా విధి—

కమల: ఏం మాటలు! విధి కొట్టి చేస్తున్నట్టు

రామం మనసుకి దగ్గరగా ఉన్న వారి వల్లే విధు లుంటాయి.

కమల మీకు పొగడ్డం బాగా వచ్చు

రామం: దీనికే ఉబ్బితబ్బిబ్బవకు

కమల పరోక్షస్మరణం నా అదృష్టం—కురవకుండా వచ్చి, దగ్గరకూచొని వెళ్లనీకుండా ఇంత ప్రేమ నేను తినను—అందుకు నాకిదే కారణమయితే అంతకన్న సిగ్గుపడవల్సింది లేదు

రామం అపోహపడకు

కమల నాకు జాలిపడ్డం కంటే, కష్టసుఖాలను చూస్తే జాలి వేస్తుంది అసహ్యం కూడా వేస్తుంది అదే భయం

రామం నీకీ ఆలోచనలు అలవాటయిన మానేయి—

కమల నిజమే నాలో నాకు నమ్మకం పోతోంది. అందుకే నాకీ అనుమానాలన్నీ మా

రామం ఏ అనుమానాలు?

కమల మీరు ప్రేమిస్తున్నారని

రామం అంతేనా?

కమల మీకొక కుటుంబంలా ఉన్నాననిపిస్తుందో లేదో అప్పుడు

రామం (నవ్వుతాడు)

కమల ఆ నవ్వు వింటే ధైర్యం వస్తోంది

రామం ఎందుకు నీకు ధైర్యం?

కమల ఇదే నిమిషమా ఇక్కడ, మీకొక భారంగా ఉండి ప్రేమనిస్తూ ఉంటే మీకు విసుగు పుడుతుం దేమోనని భయం

రామం నీకసలు అనుమానం కలిగించే పనులేమన్నా చేసానా?

కమల అయ్యో లేదండీ

రామం నీ కేదో అనుమానం వేసి ఉండాలి.

కమల (ఊరుకుంటుంది)

రామం ఏమిటా అనుమానం?

కమల మరేమిలేదు మీరు మునుపట్లా నాతో లేక పోయేటప్పటికి

రామం అంటే?

కమల: కోపమా?

రామం: లేదు కమలా చెప్పు

కమల నాతో ఎంతో ప్రేమగా, లాలనగా మాట్లాడే వారు ఇప్పుడు మీరు తీరిక లేక

రామం ఇందుకేనా

కమల ఇప్పటికే ఏదో ఆలోచనలు అయినా నేను అందుకు తగినప్పుడు ఆశించనం

రామం అదుగో మళ్లీ ఇలా మాటాడితేనే నాకు చికాకు

కమల అదుగో చూసేరా! మీకు చికాకు కలిగింది

రామం చిన్న సంగతులు మనస్సులో పెట్టుకొని ఇలాటి ఆలోచనలు చెయ్యకు—

కమల క్షమించండి మళ్లీలా అనుకోకండి—

రామం ఆ క్షమించమనడం చూస్తే అనుమానం నీకుంది-

కమల నా కనుమానం ఉంటే నాదే తప్పు మీ అనురాగాన్ని చేజేతులా పోగొట్టుకుంటున్నట్టే అందువల్ల

రామం (కమలచేతిని అందుకుంటాడు)

కమల అదుగో సరోజ

రామం: నా కగపడలేదు—నువ్వు పసిగట్టేసేవ్

కమల ఒకళ్ళ చేతిని తీసుకున్నప్పుడు వేరు దింకొకళ్ళ చేతిని ఎక్కువ చేస్తారుట

(సరోజ వస్తుంది)

సరోజ కమలా చాలా కులాసాగా ఉన్నావివాళ?

కమల ఒకనాడు కులాసాగా లేనకనా

సరోజ: ఆ చిరునవ్వే అది.

కమల నీకన్నీ కొత్తే

సరోజ నువ్వెప్పుడూ కొత్తే (రామం వైపు చూపి) రోజుల తరబడి విచారంగా ఉంటావ్ అసలు విచారమూ ఉండదు, నవ్వూ ఉండదు. ఆలోచిస్తూ ఉంటావ్ ఒకోనాడు ఇంత కులాసాగానూ ఉంటావ్.

కమల: మా ఇద్దరి ప్రేమ, అనురాగం నా కుండగా సంతోషంకోక మరేముంటుంది నాకు—

సరోజ ఎప్పుడూ అలా ఉండరాదూ?

కమల అత్యాశకూడదు. ఇంత అనురాగానికి అలవాటు పడ్డదాన్ని అది లేకుండాపోతే ఏమయి పోతానో అనిపిస్తూ ఉంటుంది.

(రామం, సరోజ ఒకరినొకరు చూసుకుంటారు—)

వచ్చేశా.. కాని నువ్విలా ప్రశ్నిస్తావనుకో లేదు

రాము యిప్పుడేమంత ప్రమాదముంది.. యింక ముందునుంచీ జాగ్రత్తగా ఉంటాలే

సరోజ ఏ జాగ్రత్తా అవసరం లేదు మనం ఇంక కేవలం స్నేహితులం

రాము అలాగే ఉందాంలే కావలిస్తే

సరోజ నీ మాటలు వింటే స్నేహం కూడా విలువ దశిపిస్తోంది

రాము : చిలిపి పిల్లలా అలకు పేరీ బతికే నాలుగు రోజులూ కులాసాగా వెళ్ళపోనీ

సరోజ విను రాము నీకు కమలమీద ప్రేమ గౌరవం ఉండొచ్చు నా వ్యాగంకోదీ నన్ను నీ సొంతం చేసుకుని నా బలహీనతకి లొంగిపోయేట నువ్వు సంతోషంగా ఉండక పోతే కమల బాధపడుతుందన్న ఆదరింపులకి లొంగి కాగు చేసేసింది క్షమించరాని నేరం

రాము : వాళ్లిద్దరూ ఒప్పేసుకున్నావ్ కదా పాపం పోయింది

సరోజ : పోలేదు కాని నేనేం మనసులో ఎంత బాధపడేదీ తెలుసుకో తెలు ఇంక ఓర్పుకో లేకపోయాను అదే చెప్తామనుకున్నాను దానికి తోడు మనం ఎంత నీచానికి దిగి పోతున్నాం అని ఇప్పుడు తెలుసుకున్నాను

రాము ఏం చెప్పాలంటే సరోజా నిన్ను కమల ముందు కూచుంపెగా చూసేక రోజా ఆ కోరిక ఉండేది తొక్కిపట్టేవాణ్ని కాని నాకు రనూ ఆశ తీపోయింది

సరోజ కమలముందు కూచుండగా నా!!

రాము ఆ—

సరోజ : నా కర్థ మతలేదు

రాము మీ ఇద్దరిలో భేదం కొట్టొచ్చినట్లుగా ఉండేది నాకెంతో బాధగా ఉండేది అందుకే కోరిక తీవ్రంగా ఉండేది నిన్ను ఆమె ముందు దగరగా తీసుకుంటే మళ్ళా మామూలు స్థితికి మనసు రావొచ్చనిపించింది అదేకాక ఏదో శక్తికి లొంగిపోయాను

సరోజ అదెంత నీచమో గ్రహించలేకపోయావూ! నే ఎంత బాధపడతానో ఊహించలేక పోయావూ

రాము : ఆ కబుర్లు చెప్పకు. నిన్ను కమలముందు దగరికి తీసుకున్నప్పుడు ఎప్పుడూ లేని ఆనందం పొందేవు

సరోజ (కళ్ళు మూసుకుని) ఏ మి టీ! ఆనందమా

రాము (నవ్వుతాడు.)

సరోజ దీనికింక అంతేక్కడ! నీకు కమలకంటే గౌరవం, ప్రేమా ఏమీ లేవు. నువ్వింక ఎంత నమ్మించినా నేనమ్మను ఎంత మోసం!

రాము (ఆలోచించి నవ్వి) పోనీ దాంగాని. ఇంతవరకూ వచ్చాక దాచి ఏం లాభం

సరోజ (నమ్మలేక) ఒప్పుకుంటున్నావ్ కూడాను!

రాము ఒప్పుకోపోతే నువ్వు నమ్మకపోవా ఒప్పేసుకున్నాక మనం దగరవుతాం

సరోజ అసం అసం

రాము అవుతాం ఇద్దగా కలిసి ఓ నేరం చేశాక ఒకరి అవసరం ఒకరికుంటుంది

సరోజ నా కవసరం లేదు

రాము కమలంటే నాకు ప్రేమ గౌరవం లేకన్నావు అవి పోయేందుకు తగిన కారణం

సరోజ: తగా!!

రాము జబ్బులో అన్ని వేళలా పగనుండి మూలేమ ఆవక బాగపడకుండా దాని మనసు పర్రైం రవ్హాలో పెట్టడంలో గాన్నాళ్లు ఇంక అన్ని వేళలా దగ్గరుండి తియ్యని కబుర్లు కొన్నాళ్లు ఇలా ఎప్పుడూ అది దాని గోడని వినుకూ చిరాకు పడటం నాది తప్పా

సరోజ అది ఆమె తప్పా

రాము ఏది ఎవరి తప్పూ కాదు

సరోజ ఎంత మోసం!! ఏది నమ్మినా నమ్మక పోయినా, నీకు కమలమీద ఎంతో గౌరవం, ప్రేమా ఉన్నాయని నమ్మేను (కుర్చీలో కూలబడి) నన్ను కమలనీ ఇద్దర్నీ మోసం చేసేవ్ (లేచి కోపంగా) ఇప్పుడు తెల్సిందా ఎవరు నాటకమాడేరో

రాము ఇద్దరం ఆడేం

సరోజ నన్ను కలవకు

రాము: మడికట్టుకున్నావా

సరోజ: నీకున్నంత సంకరలు మిరగలేదు నా మనసు

రామం: గుడ్ నాట్! నీకూ మనకే కావాలి. శేఖరం భరించలేను అరి భగవాన్!

కమల: అయ్యో!

రామం: (ఆమెను తోసి) దేవుడే నాకన్యాయం చేశాడు! అందమైన భార్య కావాలని కోరుకున్నాను—మరీ అందమైన దానినిచ్చాడు ఆ అందంతో నన్ను నరకయాతన పెట్టేవ్ నా వ్యక్తిత్వాన్ని, నా ఆత్మగౌరవాన్ని చంపేవ్ ఎన్ని ఎకారాలు చెయ్యాల్లో అన్నీ చేసేవు అటుగుక్క పోయేను నీకే జబ్బు వచ్చే వరకే నా గుండెలోంచి పెద్ద బరువు పోయింది విన్నావా? బరువుపోయింది

కమల: (తల పెలకు కొట్టుకుని) అయ్యో దేవుడా!

రామం: కాని ఇప్పటికే తెలిసొచ్చింది! పాపులని శిక్షిస్తూనే ఉంటాడు దేవుడు నీ అందాన్ని, కళ్ళని కూడా తీసుకున్నాడు నన్ను శిక్షించడానికి ప్రతిక్షణం నీ ముందు, నీ మోహం చూస్తూ ఉండవలసిందే నేను ఎంతకని ఓర్చేది. సహజానికి పాల్పడ్డాడి! నేను మనిషి నేనా! నువ్వెంత వికారంగా ఉన్నావో నువ్వే నమ్మవుకదూ? (నవ్వుతాడు)

కమల: (ఏడుస్తూ) నేను! మీరన్నది నిజమే. మీ బతుకు మీకు బాధగా చేసిన పాపాత్మురాల్ని నేను!

రామం: నేనూ పాపాత్ముడ్ని! నువ్వూ కావు. నీ రూపంలో దేవుడు నన్ను శిక్షిస్తున్నాడు నువ్వు దేవుడిలా భాగానివే! దేవతవి!!

[పకపక నవ్వి, పోతాడు]

కమల: (నిశ్చేష్టురాలయి ఉండిపోతుంది, కాసేపు, ఎటో చూస్తున్నట్టు ముఖంపెట్టి అలా ఒక నిముషంకూర్చుంటుంది లైట్లన్నీ ఒక్కటొక్కటే ఆరిపోతాయి స్టేజ్ మీద చీకటి ఆ చీకటిని చీల్చుకుని కమల గొంతు) అయ్యో! ఎక్కడున్నావ్! నన్ను తీసుకుపోవూ! నన్ను పిలుచుకోవూ నా తల్లీ!!

[తెర]

# కొటయ వేమభూపతి

శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రి

ఆంధ్రభూభాగమున ముఖ్యప్రదేశమును మధ్యభాగమున నిరుపద్రవముగను సర్వోత్తరముగను శత్రువిధేయముగను పాలించిన ప్రభువులలో వేమనామధారులైన రెడ్డిప్రభువులు ప్రధానముగ గణింపఁదగినవారు. కాకతీయ సామ్రాజ్యము విచ్ఛిన్నమైన తరువాత, ఆంధ్రదేశము యవనాక్రాంతమై శాంతియు ధర్మము విధ్వస్తమైనపుడు తదుద్ధరణమునకై బుద్ధిబాహుబలములు వినియోగించి, తదుద్ధారణమునకై యత్నించినవారిలో ప్రథములగువాఁడు ప్రోలయ వేమారెడ్డి. ఈతఁడు మహాశూరుఁడు పరమ ధార్మికుఁడునై, అద్దంకి రాజధానిగా రాజ్యపాలనము చేయుచు ధర్మోద్ధరణమునకు పారత్రికపోషణమునకు కొంతయుఁ దోడ్పడెను. శివకేశవులం దభంగ భక్తిభావ సమన్వితుండై శ్రీశైలాహోబల క్షేత్రములందు సోపానసరణి కట్టింపఁ జేసి పుణ్యకీర్తుల సాధించిన ధన్యుఁ డీతఁడు. ఆంధ్ర సాహిత్యోద్ధారకుఁడై శంభుదాసుఁడను ఎఱ్ఱాప్రెగడచే రామాయణ హరివంశముల నాంధ్రమునం దనువదింపఁ జేసిన ధన్యుఁడు. శ్రీశైలవాసియగు ఘోడరాయ గురువశ్యుని యాదేశానుసారము రాజ్యపాలనము సాగించుచుఁ, దిగుపదిష్టవిధానమున హేమాద్రిదానముల నాచరించిన ధార్మికుఁడు. ఈ విషయ మంతయు ద్రాక్షారామ శాసనమునం దిట్లు చెప్పఁబడియున్నది.

శ్లో. శేషాం ప్రశస్తిమహిమాపరపారిజాతః
శ్రీ వేమభూమి రమణో జగదేకగండః,
శ్రీ ఘోడరాయ గురువర్య దయావిశేష
త్సంప్రాప్య శ్రీశిలాముఖలంక వృత్తిః
హేమాద్రిదాన విదితాని సురూపకేశాన్
దానవ్రతాని సుమహాంత్యపి యశ్చకార
దత్వాయశోద్భుతమిదం సకలద్విజేభ్యః
శివాంఘ్రయః పృథులతాః స్వయ మన్వభుక్త
పాతాళగంగా మధికృత్య యత్నాం
శ్రీ పర్వతాగ్రా దపి హాటకాద్యాం,
సోపాన పంక్తిం కృతవాన్ సహేళ్య
కల్యాణశైలం వ్యతనోద్గుణజ్ఞః 1

ప్రోలయ వేముని యీ ధార్మిక కృత్యములు, అతని తరువాతి రెడ్డిరాజులు నిర్మించిన దాన శాసనములం గొందటియందుఁ జెప్పఁబడుచునే వచ్చినవి. ప్రోలయ వేముని కార్యము సర్వవిదితము. వీనిని తరువాతి రెడ్డిప్రభువుల సౌందర్యప్రాశస్త్యమై వెలసినవి. ఈతని కుమారుఁడగు అనవేమారెడ్డియు నీతనివలెనే మహావీరుఁడు, పరమధార్మికుఁడు విద్యాపోషకుఁడునై తన్నెక్కుకాఁడు. అనవేముని వదాన్యత సర్వాంధ్రదేశ ప్రసిద్ధమై పండిత రసజ్ఞాంగముల నాఁటికి నేఁటికి నాయక నిలిచియున్నది. ఈతని శౌర్యము కొటయ వేముని కొమరగిరి శాసనమునం దిట్లు వర్ణింపఁబడినది.

శ్లో. యస్యాస్తాం విజయే సమస్తవిదితా శ్రీశైల సింహాచలా
స్తంభౌ పశ్చిమపూర్వదిగ్విభజన వ్యాఖ్యాత
విఖ్యాతికౌ 2

ఈ శ్లోకమునుబట్టి యనవేముఁడు శ్రీశైల సింహాచలములను పశ్చిమ పూర్వదిశలందు విజయస్తంభములుగాఁ జేసి, తన్మధ్యాంధ్రదేశమును దనవశము గావించి పాలించెనని తెలియనగుచునే యున్నది.

ప్రోలయ వేముని దౌహిత్రుఁడగు కొటయ వేముఁడు విజయసాధనమున శౌర్యాటోపమున ధర్మనిరతిని అగ్రహారాది దానమున సర్వధా మాతామహుని బోలినవాఁడు. ఈ విషయ మంతయు కొటయ వేముఁడు గోదావరీమండలమున వెలయించిన దానశాసనములవలన విస్పష్టముగఁ దెలియవచ్చుచునే యున్నది. మాతామహునికంటెను గూడ నీతని కొక విశిష్టత గలదు. తెచ్చిపెట్టిం దీతనికిఁ గల సంస్కృతభాషా పాండిత్యము. రాజరాజనరేంద్రుని తరువాత రాజమహేంద్ర

1 చూ. రెడ్డిసంచిక అనుబంధము 1 శాసనము.

2. See J A H R S Vol XI P P. 209

నగరము రాజధానిగా నాంధ్రదేశపాలనము నరల నతని పాటనే కొనసాగినది.

ప్రోలయ వేముని నాడును, అతని జ్యేష్ఠసుతుడైన యనపోత రెడ్డినాటను కొండవీటి సామ్రాజ్యము కృష్ణాది పరిసరములందే సీమితమైయుండెను అనపోతుని తరువాత కొండవీటి రాజ్యసింహాసనాధ్యాసీనుడైన అనవేమారెడ్డి, గోదావరీ పరిసర దేశమంతయు జయించి, రాజ్యసీమను ప్రాగుత్తరముగా సింహాచలము వఱకు వ్యాపింపజేసెను అనవేము డుభయ గోదావరీ తీర పరిసర దేశమంతయు జయించినట్లు లాతడు దక్షారామాది ప్రదేశముల నెలకొల్పిన శాసనములబట్టియు, ఆయా తీరములందు వెలసిన వేమవరాగ్రహారముల బట్టియు దెలియవచ్చుచున్నది మఱియు శ్రీశైలమున మల్లికార్జునస్వామి యాలయమునందు వీరశిరో మంటపము నిర్మింపజేసి, వలయింపజేసిన శాసనమునందలి బిరుదావళిలోని "సింహాచలాది వింధ్యపాదప్రతిష్ఠాపిత కీర్తిస్తంభ, సం[హా]గర గౌతమీ [సంగమ] సకల జలదుర్గ సాధన రఘురామ, రాజమహేంద్రనగర నిరవద్య నగరాది బహువిస్తృతదుర్గ విదళన బలరామ[3] " ఇత్యాది విశేషణములచే నీతడు గోదావరీతీర దుర్గములను జయించి, కొండవీటి రాజ్యమును సింహాచలమువఱకు పొడిగించెనని నిర్ధారితమగుచున్నది అనవేముని తరువాత కొండవీటి సామ్రాజ్యపాలకుడుగా కుమారగిరి వచ్చినపుడు, అనవేమునినాడు విస్తృతమైన రాజ్యసీమ లన్నియు వానిని యేలుబడిలో నుండునటుల చేసినవాడు—ప్రోలయ వేముని దౌహిత్రుడు, అనపోత రెడ్డి యల్లుడు, కుమారగిరి సోదరీ భర్త, చతుర్విధోపాయనయప్రవీణుడు, సామ్రాజ్య నిర్వహణ దక్షుడు మహామాత్యుడు ప్రధాన సేనానియు నగు కాటయ వేమారెడ్డియే

కాటయ వేముడు కుమారగిరి భూపాలుని సింహాసనమున గూర్చుండబెట్టి శ్రీకృష్ణుడు ధర్మజునివలె పట్టాభిషిక్తుం జేసెనని, కాటయ వేముని గోపవరము తొత్తరమూడి శాసనములలోని యీ క్రింది శ్లోకము తార్కాణించుచున్నది

శ్లో॥ సింహాసనే విధాయాసౌ కుమారగిరిభూభుజమ్
అభిషేచయ న్మహోత్సేవా శ్రీకృష్ణ ఇవ ధర్మజమ్[4]

కాటయ వేముని రాజనీతి చతురత బాహుపరాక్రమము మహోన్నతములని యీ క్రింది శ్లోకములవలన దెలియుచున్నది

శ్లో॥ ఆసీ దమాకల్పరత్నం కాటయ వేమ ప్రభు స్తస్య
అతి సురగురుభార్గవ మతి రతిభార్గవ విజయ
విఖ్యాతిః 5

శ్లో॥ పల్వలపంచక మకరోత్ కృత్వా నిర్జిత్య వైరిణో
రాజ్ఞః,
వైరికుల పరసురామః కాటయ వేమసు కీర్త్యా
ర్జితకీర్తిమ్ 6

కుమారగిరికి కాటయ వేమ ప్రభువు ప్రధానామాత్యుడు ఈతడు బుద్ధి విభవమున బృహస్పతి శుక్రులను, విజయములం సాధించి విఖ్యాతి నార్జించుటలో పరశురాముని మీఱినవాడు పరశురాముడు యుద్ధములందు శత్రువులను జయించి పల్వల పంచకము (ఐదు మడుగులను) గావించెను శత్రుకుల పరశురాముడైన కాటయ వేముడు కందలేని కీర్తి సముద్రములను నిర్మించెనని భావము కాటయ వేముడు తన బుద్ధి బలమున రాజకీయము లన్నియు నెరవేర్చుచు, బాహుబలమున నుద్ధతి శత్రువుల వణకుచుండ, వానిని కెలికరైయు కుమారగిరి వసంతోత్సవము జేసెను, నూతన నయ ప్రదర్శనముల తోడను, స ప సంతానాభ్యుదయ ములతోడను నానందముగా గాలము గడుపు భాగ్యమును బడయగలిగెనని, కాటయ వేమ విరచిత మాళవికాగ్నిమిత్ర వ్యాఖ్యానము నందలి యీ క్రింది శ్లోకము తార్కాణించుచున్నది

శ్లో॥ భాగ్యం నామ సమగ్ర మీదృశ మతి స్నేహైక
పాత్రం యతో
వీరం కాటయ వేమ ముద్ధత రిపు స్తంభే నియోజ్య
స్వయమ్,
నిత్యం నందతి నర్తకై రభినవైః కాంతై
ర్వసంతోత్సవై
స్సంతానాభ్యుదయైః కుమారగిరి భూపాలో
నృపాలోత్తమః,

కాటయ వేముడు కుమారగిరిని దన కెలికగా భావించుచు, వానియెడ కృతజ్ఞత గలిగి యాతని యాజ్ఞను శిరసావహించుచు, వాని పక్షమున విజయములు సాధించుచు డెసె వాడెను విషయమును అని

---

3 See S I I Vol x No 559

4 J A H R. S Vol XI

5 Epi Ind Vol IV P P 318 to 327

6. అభిజ్ఞానశాకుంతల వ్యాఖ్య కుమారగిరి రాజీయము.

అని కలువచేరు శాసనమునందలి యీ శ్లోకము తెలుపుచున్నది.

శ్లో. మాలా మమ్లాన పుష్పావలిశిరసివహ న్నవ్యభూభృద్దుర్గజ్ఞా
మూర్ధ్వం ఖడ్గేశ్వరారి క్షితిపతి రఖిలాన్ప్రతీప ప్రతాపః,
జిత్వా ప్రాజ్యలక్ష్మీ మనుపమ విభవాం
ఖ్యాంధకాన్ప్రంధ్యభృతిః
కీర్తిః సేవాపరో భూత్కుమారగిరి విభోః
కాటయాధీశ వేమః 7

కాటయ వేముఁడు కుమారగిరి యాజ్ఞను శిరోధార్యముగావించి, యాతనికి విజయములు చేకూర్చుచుండెనను విషయమును అనుశాసనము తెల్పుచున్నది. కుమారగిరి తన కుమారుఁడగు అనపోతారెడ్డిని యౌవరాజ్య విభూషితునిగావించి, మూర్తి దిగ్విజయప్రాంతమైన దేశము నాతనికీయఁదలఁచినాఁడు. ఆ పని కాటయ వేముని కొప్పగించెను. ఆ ప్రకరణమునందు కుమారగిరి వేమునకిట్లు జ్ఞాపించి యున్నాఁడు

ఉదీచ్యాదాక్షిణాత్యాః ప్రతీచ్యాః మహీశ్వరాః
ఆచరంతి సదా మైత్రీ మస్మాభి రతిగౌరవాత్
తిష్ఠత్సింహాద్రి పర్యంత ప్రాచ్యా ఏక మహీశ్వరాః
జేతవ్యా స్సర్వభూపాలా నధునా జయశీలయా 8

కొండవీటికి ఉత్తరమునను దక్షిణమునను పడమటను నుండెడి మహీపాలురు మాతో నతిగౌరవముతో మైత్రి నెఱపుచున్నారు. తూర్పున సింహాచల పరిసరమునంగుండెడి తూర్పువాఁటి మహీపతులౌ కేతిగ్నపతులలోని వారగు తూర్పు వారిని నీవు జయింపుము అని పై శ్లోకముల భావము.

ఇచట కుమారగిరితో మైత్రి నెఱపుచుండిరని తెలిపిన యుత్తరదేశ మహీపాలురందఱును కాటయ వేముని శౌర్యమునకు నీతి నిపుణతకు లొంగియే యట్లు చేయుచుండిరని యూహింపవచ్చును. కొండవీటికి దక్షిణమునందుండెడి విజయనగరాధీశులు, పశ్చిమమునందలి సులతానులు ఈ తీరమున కొండవీటి రాజమహేంద్రవరములందు పడుచునుండెడి దుర్గాధిపతులు కుమారగిరితో నానాఁడు మైత్రి నెఱపుచుండెడివారని, వార విలాసమునందలి

"హరిహరరాయ భేరీ
మహోసురధాణగజాధిపాది భూ
వరులు నిజప్రభావ మభినందన
సేయఁ కుమారగిర్యధీ
శ్వరుని వసంతవైభవము "

సాగుచుండెనను శ్రీనాథుని వచనములఁబట్టి తెలియుచున్నది. కాటయ వేమునకు హరిహరరాయలతో వైవాహిక సంబంధమేర్పడినటు, అలాగే వేముని వేమవర శాసనమందలి యీ క్రిందిశ్లోకము తెలుపుచున్నది.

శ్లో పుత్రీం కాటయ వేమయక్షితి
పతేః పౌత్రీంచ కాటప్రభోః
దౌహిత్రీం గణపాంబం
హరిహరక్షోణీపతే స్సూనవే,
తస్మై సూనృత విదితాహ్వయాం
హరిహరాంబాం చారుమంగళాహ్వా
దత్వా వేమమహీశ మల్లప్రపతే
ప్రాప్నోదప్య లక్ష్మీపదమ్ 9

హరిహరరాయల పుత్రికను కాటయ వేముఁడు పెండ్లాడుటచే విజయనగరాధీశులతోడి కలిమితోడి కాటయ వేమునకును, తన్మూలమున కుమారగిరికి చేర్పడి, పిమ్మట వేముని పుత్రిక హరిహరరాయల దౌహిత్రియు నగు హరిహరాంబ నల్లాడ వేముఁడు పెండ్లాడుటచే నల్లాడరెడ్డికిఁ దక్షుకులకును విజయనగరాధీశులతోఁ గలిమి యేర్పడియుండెనని మన మూహింపవచ్చును. ఫిరోజషా, గజపతులు మున్నగువారు కాటయ వేముని ధాటి కాఁగలేక మైత్రి నెఱపుచుండెడి వారనియూహింపవచ్చును."

ఇట్టి యుద్ధాఁటి గారణముగా రాజమహేంద్రవరము మొదలుగా సింహాచల పరిసరములకు నుండిన ప్రాచ్యభూపతులు నీ గద వేముని తాఁకలేకయుండి, కుమారగిరి నాఁడు కురలఁ దలకెత్తుచుండగ వారిని జయించుటకు కుమారగిరి నియోగింపఁగా కాటయ వేముఁడు కొండవీటినుండి సైన్య సన్నాహముతో

7 చూ. ఆం. సా. ప. పత్రిక సం 2. పు. 108. అనితల్లి కలువచేరు శాసనము.

8. చూ. ఆంధ్రదేశపు పరిశోధక మండలి రెడ్డి సంచిక పుట ౪౪౩.

9 See. epi Ind vol XIII P. P 287 t 287.

దాడివడలి వచ్చి, రాజమహేంద్రవరమున నిలిచి, యచటనుండి ముందునకు పోగి విజయమును సాధించి నట్లు అనవ్వర్తి శాసనమే తెలుపుచున్నది. మఱియు కాకాంటికి రాజమహేంద్రవరము కొమరగిరిపాలనమునంగే యుండెనట్లు క్రింది శాసన శ్లోకములు వివరించు చున్నవి

శ్లో॥ అతిశైలపురా త్రివక్రకుమరగిరి భూపతేః
రమ్యం రాజమహేంద్రాఖ్య నగరీం
ప్రతిష్ఠ పవ్యతి,
అతిన్పింహాద్రి వింధ్యాద్రి మధ్యవర
మహేశ్వరాన్
జిత్వా తద్దేశగురేషు నియుక్త్యాధికారిణః

కాటయ వేమఁడు కొండవీటినుండి బయలుదేరి, కొమరగిరికిఁ జెందిన రాజమహేంద్రనగరమును జేరి, యటనుండి దండువిడలి వింధ్యపర్వత సింహాచల మధ్యగులయిన మహీపులను జయించి, యాయా దుర్గములంగుఁ దన యధికారులను నియమించి ఆ హారములతోఁ గూడిన విజయమును కొమరగిరి కర్పించెనని ఏతచ్ఛాసన విషయము. ఈ లోన వేమఁడు జయించిన దుర్గము లేవియో యీ శాసనమున నిరూపింపఁబడియుండలేదు గాని, కాటయ వేమ విరచితమైన అభిజ్ఞానశాకుంతల వ్యాఖ్యానమున క్రింది విధముగ వివరింపఁబడినవి

శ్లో. ధాటీఘోటి ఖురాగ్రకుట్టిత గిరితటే
యాత్రి మొల్లేటి దుర్గం
దుర్గం కిమ్మూరి సంజ్ఞం దళితరిపుబలే
దుర్గమం తెంపెపూండిమ్,
దుర్భేదం వజ్రకూటం జితవతి రథినా
రామగిర్యాఖ్య దుర్గం
విఖ్యాతం వీరఘోటం గలిత మధుహ్రదాం
వీరపత్న్యాహాధాష్ట్రిర్యమ్

కాటయవేమఁ డిట్టి సైన్యముతో దాడివడలి గిరిదుర్గములు పిండిపిపోఁడు, మొల్లేరు, కిమ్మూరు, తెంపపూండి, వజ్రకూటము, రామగిరి, వీరఘోటము అను దుర్గములు జయించి శత్రువుల కీర్తి పర్వతాలను నణఁగించెనని దీని భావము. ఈ దుర్గము లన్నియు కొండవీటి ప్రాగ్దేశములోనివి వివరము—

తెంపపూండి—ఇది పిఠాపురమున కుత్తరముగ పదుక్రోసుల దూరలో, అన్నవరక్షేత్రమునకు ఒక క్రోసు తూర్పునున్నది అచట శిథిలమైన దుర్గ మొకటి నేఁటికిని గలదు

వజ్రకూటము—ఇదియును పిఠాపురమునకు వాయవ్యముగ నున్నది క్రోసుల దూరలో నున్నది. అచటను దుర్గశిథిలములు గలవు ఇది నేఁడు పిఠాపురమున వంకాయలకు ప్రసిద్ధివహించియున్నది. వజ్రకూపు వంకాయలని నామమున్నది

వీరఘోటము—దీని నేఁడు 'వీరఘటము' అని యందురు ఇది శ్రీకాకుళముజిల్లాలో పాలకొండకు సమీపమునందున్నది ఇది నేఁడు అరటిపండ్లకు ప్రసిద్ధికెక్కియున్నది

మొల్లేరు—ఇది నేఁటి తూర్పుగోదావరిజిల్లా ఎల్లవరము తాలూకాకుఁ జెందిన గ్రామము ఈ యూరఁ గాటయవేమునితోడి సంబంధముగల శాసనము గానవచ్చెఁడి 10

కిమ్మూగురము—ఇది యీ జిల్లాలోని పెద్దాపురము తాలూకాకుఁ జెందినది పెద్దాపురము తాలూకాలోని కొన్ని గ్రామములకు కిమ్మూరుసీమ యని పేరు ఈ తాలూకాకుఁ జెందిన జగంపేటయను గ్రామమునకు సమీపమున కిమ్మూరు ఉత్కృష్టపురమను గ్రామములదు దాని చాటున కిమ్మూరుదుర్గమని వ్యవహరింపఁబడు ప్రదేశముగలదు దుర్గప్రదేశము చాలభాగము పొలములలోనికి వచ్చినను దాని కోటవామము నిలిచియున్నది దుర్గశిథిలములుకూడ గానవచ్చును.

రామగిరిదుర్గము—ఇది రాజమహేంద్రవరమున కుత్తరముగ పదిక్రోసుల దూరలో, అచటి గోదావరీతీరమునంటియున్న రత్నపోలవరమున కొంచెయుత్తర మూఁడు క్రోసుల దూరలోనున్నది ఇది గిరిదుర్గము జలదుర్గము కూడనైయున్నది ఇది నేఁటికిని దుష్ప్రవేశస్థితియందె యున్నది ఇది కాటయవేమునివాఁడు అన్నదేవచోడునకు రాజధానియై యుండెనోపును పట్టిసక్షేత్రమున కిది నాలుగు క్రోసులమీఁద నున్నది. ఈ జలదుర్గమునం దొక పెద్ద పద్మాకరము గలదు.

ఈవిధముగఁ గాటయవేమఁడు రాజమహేంద్రవరమాదిగ సింహాచలమువఱకు నుండిన దుర్గములను జయించి విజయము సాధించెనని యూహింపవచ్చును.

---

10. See S. I. I vol X No 578.

వారి కొమరగిరిపురం, మండెఖ రామనాథ సోమయాజులవారి రుద్రభట్లు మూగభట కొమరగిరిపురం, గ్రామాగ్రేసరుల కొమరగిరిపురం, అన్నదానం అవుధానులంగారి రామనంగారి కొమరగిరిపురం వలపల్లి అన్నభట్లభట్ల కొమరగిరిపురం, [శ్రీ] వారం వీరఘుంట శ్రీ నరసన్నంగారి కొమరగిరిపురం, వినపాల పె[ద]కొమరగిరిపురం కొమరగిరిపురం లోకరాజా వారి కొమరగిరిపురం, పుల్లాయపేట [చిన] కొమరగిరిపురం, పుండరాజువారి తిర్లా [ప్పె]గిన కొమరగిరిపురం, వేదాద్రి శ్రీ నరసింహ్వాగరవర కొమరగిరిపురం, కొచిరాజా తిమ్మనంగారి కొమరగిరిపురం, అరఘ్యుల మల్లనంగారి కొమరగిరిపురం, చేయేటి శ్రీ శిరవానారి కొమరగిరిపురం, కాకొంద శ్రీ నరసింహ్వాగరవర కొమరగిరిపురం, దొంతిపోతిపిష్ణుల కొమరగిరిపురం, దాయూరి సోమయాజులువారి మలుభట కొమరగిరిపురం, శింగాయ పండితులవారి విశ్వనాథ పెమ్మన కొమరగిరిపురం, శిద్దాయ పండితులవారి అన్నా పండితుల కొమరగిరిపురం, పంటులూరి శ్రీ గిరగన్నంగారి దేవులైన మల్లాయమంగారి పసపుకిచ్చిన కొమరగిరిపురం, మైలార గేవరకొమరగిరిపురం మాలం గూరంమ కొమరగిరిపురం

శింగాయ పండితుల [త్రి]మూ పండితులవారి అన వేంకరము, ఆకుల పెద్దిభట్ల వారియా [రి మంచ మారవర ] [కొట] మ రెడి వేంకరం, దేవన్నయాం గారి ప్రతాప అన్నవరం, మూడము రమణా[థ] సోమయాజుల నాగిపెద్దవరం, వంకేశ్వుల కొరిగడవర వేంగగం, పెన్నవరం, వీరవరం, ప్రపన్న శ్రీ పాదాల లక్ష్మీనరసింహ్వపురం

కొటమరెడ్డి వేమారెడ్డింగారి అర్ధాంగలక్ష్మి [అ]న ఆ కొమరగిరయ్యంగారి ఇ కొమరగిరయ్యం గారై అవతరించిన [ఇ] కొమరగిరయ్యంగార్కి తల్లిగ నైన తల్లమాంబ మంగారు ఇ కొమరగిరయ్యంగారికి [న్ని] కొటమరెడ్డి వేమారెడ్డిం గార్కిన్ని సుకృతము గాను శ్రీ గౌతమీ తీరమందును వేదాద్రి శ్రీ నరసింహ్వ దేవునకును ప్రతి సంవత్సర తిరునాళ మహోత్సవానకు ధారవోసి సమర్పణచేసిన వెలమూరి తిల్లవరము కొటమరెడ్డి వేమారెడ్డింగారి అర్ధాంగలక్ష్మి అ ఇన మల్లమాంబ మంగారు కొటమరెడ్డి వేమారెడ్డిం గార్కిని స్వామి అ ఇన కొమరగిరయ్యంగార్కిన్ని వారి దేవులైన అనంగారలకున్ను అతియ సుకృతము ఇ అట్లుగాను మకర సంక్రమణ పుణ్యకాలమందు రాజమహేంద్రవరానను శ్రీ గౌతమీ తీరమందు మార్కండేశ్వర దేవరకు సమర్పించి సుకీర్తించి, మార్కండేశ్వర దేవరకు నిత్య అతసరాలకు ఇచ్చిన మల్లవరము 11

ఈ యాదోబల శాసనము కొటయ వేముని దానాన్నకకు సుకృతానకు ద్రవ్యతిక్రితజ భాగముతకు నిదానము ఈ శాసనమున చేర్కొనబడినవానిలో పెటెఅనులా పురము కొలూరుకు చెందిన కొమరగిరిపట్నము మరసుళ్ళ పితిశ్రీగావకు చెందిన కొమరగిరి, నర్సవర భావనారాయణస్వామికి చెందిన పిఠాపురమునకు సమీపమునమున్న గోరస కొమరగిరియును నా పేర్లతో నిలిచి యున్నవి. మిగిలినవాని పేర్లు నివనచ్చుటలేదు. మొత్తము మీద రాజమహేంద్రవర రాజ్యమునకు కళి కైవతిగావాత గాటయ వేముడు గోదావరీతీర భూములందు పెక్కుగ్రామములు ధారవోసి యిచ్చి తన ధార్మికతను సుస్థిరము చేసియున్నాడు. ఈ శాసనము వలదలి తుదివాక్యములనుబట్టి కొటయ వేమునకు తల్లాంబిక మల్లాంబిక యను నిద్దరు భార్యలుండి నట్లు తెలియవచ్చుచున్నది. వీరిలో తల్లాంబికయే కొటయ వేమునకు పుత్రుండై జన్మించిన కొమరగిరికి తల్లియని యీ శాసనము స్పష్టము చేయుచున్నది. వేముని కవితల్లి యను పుత్రిక గలదు. కొటయ వేమునకు నొక పుత్రుడు కొమరగిరి మరణించినవెనుక, కొటయ వేమునను దిగంగతుడైనపిదప రాజమహేంద్రవర రాజ్య మీయనితల్లికి సంక్రమించినది. ఈయనితల్లి నిగన్న తల్లి దొనగా? యనునది సంశయాస్పదముగ నున్నది. ప్రోలయ వేముని కొడుకు అనవేముడెయున్నట్లు, తల్లాంబిక కూతురనితల్లి దొనదా? లేక మల్లాంబిక కొమరగిరి సోదరియై తత్పురుషునటచే అనితల్లికి రాజ్య సంక్రాంతి గలిగెనా? దీనిని వివరించు శాసనాద్యాధార మేదియు నింతవరకును బయలుదేరి యుండలేదు

ఇది యిటుండ అనితల్లి కలువచేరు శాసనములో అనితల్లినిగన్న తల్లి దొడ్డాంబిక యనిపించు శ్లోక మొకటి యీ తీరుగ నున్నది.

శ్లో యస్యాధ్వేమ నృపాలోజనకో దొడ్డాంబికా జనయిత్రీ
సా దీనశ్రత్యనితల్లీ సదూర్తిరిక దేశభూమిదేశ్యే

11 S.I.I. vol X No. 577.

# కాటయ వేమ భూపతి

ఈ శ్లోకములకు యథార్థముగా నర్థము చెప్పు కొనినచో, ఎఱ్ఱనేని వేమభూపాలుడు తండ్రియు, దొడ్డాంబిక తల్లియు, అయినతల్లి అక్కౄరి దాల్బీక దేవభూదేవలక్ష్మి వనె దేజరిల్లుచున్నదని యర్థము చెప్పవలెను. దీనిని బట్టి దొడ్డాంబిక యాపెద్దదని యూహింపవలెను. కాటయ వేమునకు తిర్లాంబిక మల్లాంబిక యనువురు భార్యలై యుండినటు లహోబల శాసనము తొత్తరమూడి శాసనము పేర్కొనుచు చున్నవి. వారి యనుమతిపైన తిలకరము మలకరము అను గ్రామములు దానముచేయబడినటు లా శాసనములు నిరూపించుచున్నవి. వేమునకు దొడ్డాంబిక యను భార్య యుండినట్లు ఏయొక్క శాసనమునఁ గాక మఱియొక్కడను గాని విషయము తెలుపఁబడియుండలేదు. కాని కాటయ వేమునితల్లి, ప్రోలయ వేముని కూఁతురు, అనపోతారెడ్డి సోదరియునగునామె 'దొడ్డాంబిక' యని బహుశాసన ప్రసిద్ధము. ఈ విషయమును ధ్రువముచేయు నీక్రింది శ్లోకము వేముని పెక్కు శాసనములలో గాన బడుచున్నది.

శ్లో॥ సప్తాకాటమహీభుజో, గుణగణోదారస్య భూర
ప్రభోః
పౌత్రః, కాటయ వేమ భూమిరమణః శ్రీ వేమ
పృథ్వీపతేః
దౌహిత్రః, పునరన్నపోతనృపతే ర్భ్రాత్రీయ
చూడామణే
ర్జాయాతే జయతి క్షితిం చిరమసౌ దొడ్డాంబికా
నందనః 12

ఈ శ్లోకమునుబట్టి కాటయ వేముఁడు దొడ్డాంబికా కుమారుఁ డనుట నిర్వివాదవిషయము. కావున పైఁ గలుకచేడు శాసన శ్లోకములకు "ఎఱ్ఱనేని దొడ్డాంబికతల్లియౌ యనుట కాటయ వేముఁడు జనకుఁడు గాఁగలయని తల్లియని యర్థము చెప్పఁగొనవలెనా! లేక లేఖక ప్రమాదమున నీ శ్లోకమున 'తిర్లాంబికా, లేక మల్లాంబికా' యను టకు బదులుగా 'దొడ్డాంబికా' యయినదా! యను విషయమింతవఱకు నిశ్చయించుటకు వీలుపడదు. అద్రితకోటల మాత్రము కలుకచేడు శాసనము ను దర్శ్యధాత్రీపాలుఖ్యము సంగ్రహించి, కాటయ వేమునకు మూఁడుగురు భార్యలనియు, వారిలో దొడ్డాంబిక కొమర గిరి సోదరియనియు, తత్పుత్రియగుటచే అనితల్లికి వేమునిరాజ్యము సంక్రమించెననియు వ్రాసి యున్నారు. కాని యీ విషయమును స్పష్టముచేయు శాసనాద్యాధారమేదైన క్రొత్తగ నుపలబ్ధ మగునంత వఱకు నిట్టియూహ పరిగ్రాహ్యమని భావిం పఁదగుటలేదు.

రాజమహేంద్రవరరాజ్యమును, కాటయ వేముని తదనంతర మాతని వంశాంకురమై నిలిచి, రాజ్య సంక్రాంతికి దాయార్హతగలది అనితల్లి యగుటచే, నామెను మామగారగు అల్లాడరెడ్డి యామె కీ రాజ్య మును సంక్రమింపఁజేసెనని యీ క్రింది శాసన శ్లోక ములు నిరూపించుచున్నవి

శ్లో॥ దురిత రహిత చిత్తో దొడ్డ అల్లాడ భూపో
భువ మరి జనవర్యం భూయసాబాహువీర్య దోష్ణా,
విమలగుణయుతాయాం వేమ భూపాత్మజాయా
మనితి సురగుధాయా మన్నితల్లాంబ యాస్తే 13
గతే దివం కాటయ వేమభూపే
నిర్మూల్య శత్రు ద్రోహికులం సమస్తం,
అదండల క్షీక మహా తపోభి
తత్సంతతే రాజ్య మరాత్మనష్టమ్ 14

కాటయ వేముఁడు తూర్పుకోటి దుర్గవిజయ ములకు బయలుదేఱినపుడు దారిని వెంటవచ్చిన సేనాధి పతులలోఁ బ్రధానుఁడు, కొండవీటి ప్రభుపుత్రో కొంపెద నా అతడు యొప్పడియున్న రెడ్డివిరుఁడు అల్లాడ రెడ్డి. తనఁడు కాటయ వేముని యా విజయ యాత్రలో నాతని కండదండయై నిలిచినవాఁడును నాతనితో నియ్యమందినవాఁడును. కాటయ వేముఁడు తన కూఁతు లలో హరిహరాంబను అల్లాడరెడ్డి సుతులలో జ్యేష్ఠుఁ డగు వేమునకును, అతని ద్వితీయ సుతుఁడైన వీరభద్రా రెడ్డికి అనితల్లిని నిచ్చి వివాహము చేసెను. తమ్ముల కుమారుఁ గాటయ వేముని రాజ్యము ననితల్లికి సంక్ర మింపఁజేయుమని నిశ్చయింపఁడైన అల్లాడ రెడ్డికైఁబడి నది. హరిహరాంబయుఁ గాటయ వేముని పుత్రియై యుండ, అనితల్లికే కాటయ వేముని రాజ్యమును సంక్రమింపఁజేయుటకుఁ గారణ మామె కొండవీటి ప్రభువులకు దౌహిత్రియై యుండుటయే కావల యును. లేకున్న కాటయ వేముని పుత్రియైన హరి హరాంబకా రాజ్యమేల సంక్రమింపరాదు! కాటయ వేముఁడు దివంగతుఁడైనంతనే, రాజమహేంద్రవర

12. చూ॥ కొమ్మనవరము, గోపవరము, తొత్తర మూఁడి శాసనములు

13 చూ. అనితల్లి కలువచేఱు శాసనము.

14. See. S. I. I. vol V No 118.

ప్రముఖంతుఁడో అంతటి సంస్కృత పాండిత్యము గల వాఁడు. ఈతని వైదుష్యము కుమారగిరి యానతిని వసంత రాజీయోక్త మారమున నాట్యశాస్త్ర సమన్వయము చేయుచు రచించిన కాళిదాస విరచిత రూపకత్రయ వ్యాఖ్యానము లను కుమారగిరి రాజీయములం గుఁ గానవచ్చును. ఈతని వైదుష్యమును గూర్చి నే నింతకు రెడ్డి సంచికలో 'కాటయ వేముని వైదుష్యము' అను వ్యాసమునఁ గొంత తెలిపియుంటిని 15

కాటయ వేమఁడు కవిసమ్రాట్టైన కాళిదాస విరచిత దృశ్యకావ్యములు మూఁడింటికి వ్యాఖ్యానము రచించి యుండుటచేతనే, మల్లినాథసూరి శ్రవ్య కావ్యములకు సాలంకృతముగ వ్యాఖ్యానించి దృశ్య కావ్యములకు వ్యాఖ్య రచించుట మానినాఁడు. వేమఁడు కుమారగిరి యానతిమున, వారి విరోధ దినములఁగల కృతజ్ఞత నెఱిఁగించుచు, తద్విరచిత వసంత రాజీయాభిధానముతో లక్షణ సమన్వయము నెఱపుచుఁ గృతిని రచనమునకుఁ గడఁగుటచే, నీతని వ్యాఖ్యలవలనఁ గుమారగిరి పాండిత్యముకూడ విజ్ఞాత మగుచున్నది. ఏయే కవులందు భరతాది ప్రాచీన నాట్యశాస్త్ర విషయములకు లోఁగని యంశము లుండునో యట్టి కవులందే వసంతరాజీయోక్త పద్ధతిని నాట్యశాస్త్ర సమన్వయము గావింపఁబడినది. కాని యాశాస్త్రసమ్మతమైనచోట లక్షణము సర్వథా సంక్షిప్త విచ్ఛేదింపకుండుటను వ్యాఖ్యానమును చేయు పద్ధతిలోఁ గాటయవేమఁడు సంగ్రహించిన పద్ధతి సర్వదా సమర్థనీయముగనుండెను. ఈతని వ్యాఖ్యలందలి విశేషతను గూర్చియు వసంత రాజీయవిశేషతను గూర్చియు మఱి యొకప్పుడు నా యెఱుక కొలఁది విశదింప బ్రయత్నింతును.

15 మా రెడ్డి సంచిక పుట ౪౫౪ ౪౬౬

# అంతర్వాహిని

హితశ్రీ

* గతసంచిక తరవాయి *

## 12

విశ్వం హైదరాబాద్ నించి తిరిగివచ్చాడు బండి దిగగానే ఎదురుగా వొచ్చాడు గోపీ తనకు దగ్గరగా ఉన్నవాళ్లు ఎవరొచ్చినా గోపీకి అలా ఎదురురావటం అలవాటు. విశ్వం అది చాలాసార్లు గమనించాడు. అయితే అలా ఎదురురావటమనేది అందరిపట్లా సర్వ సామాన్యమే తనూ తెలిసినవాళ్లొస్తే ఎదురువెళతాడు కాని తనలాంటి పెదవాళ్ళు అలాచేయటంలో కుర్రవాడైన గోపీ అలాచేయటంలో తేడా ఉంది. వరం దాంతో తిరిగి గాహాగ్యాని కబురు చెప్పుకుంటున్నప్పుడు విశ్వం గోపీని అడిగాడు. "వాళ్లూ బండిదిగి చుట్టాలెంతకూ వొస్తున్నప్పుడు ఎదురువెళ్లటం దేనికిరా గోపీ, వాళ్లెలాగూ ఇంట్లోకి వస్తారుగా"

గోపీ ఈ ప్రశ్నకి తెల్లబోయాడు. ఏం సమాధానం చెప్పాలో వాడికి తెలియలేదు.

"ఊరికే" అన్నాడు

"మర్యాదకోసమా?"

గోపీ అర్ధభారం చదువుతున్నా అది ఈడుకి మించిన చదువు. వాడికి ప్రశ్నలోని భావం సరిగా అంతుకాదని విశ్వానికి తెలుసు "ఉహూం" అన్నాడు గోపీ ప్రశ్న అర్ధమైనట్టుగానే

"వెళ్లాలనిపిస్తుందా?"

అవునన్నాడు గోపీ ఎందుకనిపిస్తుందో వాడికి తెలియదు వాడు ఆలోచించిచూడ్లేదు. కాళ్లు లాక్కుపోతాయి, అంతే

విశ్వం ఆలోచించాడు. తనలా ఎదురువెడితే ముఖ్యంగా మర్యాదకోసం వెడతాడు. మనస్సు హెచ్చరిస్తుంది పరిచయడికి ఆహ్వానం ఏంలేదు. పరచయస్థుణ్ణి చూడగానే హృదయాంతరాళ సాంగత్యం ఏదో అప్రయత్నంగా వాడిని అలా లాక్కుని వెడుతుంది.

ఇది పైకి చాలా చిన్నవిషయంగానే కనిపించినా ఇందులో గంభీరభావం ఏదో ఇమిడివున్నట్టనిపించింది విశ్వానికి. అన్నిసార్లు గోపీ తన బండివగ్గిరికి పరిగెత్తుకుని వచ్చినా తానావిషయం గురించి ఈరోజులా ఆలోచించినట్టు ఆలోచించలేదు పూర్వం ఎన్నడూ ఈసారి గోపీ అలా రావటం చూడగానే తనకీ ఊహ ఎందుకు కలిగిందో!

కొంచెంసేపాగి విశ్వం అడిగాడు.

"గోపీ, నువ్వెరిగిన వాళ్ళందరిలో ఎక్కువ మంచి వాడెవరు?"

"రంగారావు మాష్టరుగారు" తడుముకోకుండా చెప్పాడు వాడు

"ఎందుకూ?"

గోపీ ఆలోచించాడు

"ఏమో" అన్నాడు చివరికి

రంగారావు మంచివాడే అయితే గోపీమాష్టర్లలో అంత మంచివాళ్లు ఇంకా ఉన్నారు. కాని వాడికి రంగారావంటేనే అభిమానం ఎందుకో! ఆ విషయం వాడికీ తెలియదు

"అందరిలోకీ ఎవరంటే నీకిష్టం?"

గోపీ కొంచెం ఆలోచించి అన్నాడు.

"అక్కయ్య"

"ఎందుకు?"

ఈసారి సమాధానం వాడికి తెలుసు. శైశవానికి ఒళ్ళొచ్చినప్పుడు రైలు కదులుతుంటే అక్కయ్య దూరమవుతుంటే వాడికి కన్నీళ్ళుతిరిగాయి, అక్కయ్యకీ తిరిగాయి. వాడికి అక్కయ్య కావాలనిపించింది. వాడి ఆలోచనలు ఆ మేరకు మరలాయి జవాబివ్వటం మర్చిపోయాడు. విశ్వం అది గమనిస్తూనే ఉన్నాడు. వాడి మనసులో ఏ మూలో కూడా అతనికి తెలుసు.

విశ్వం ఆలోచనలోపడ్డాడు. కొన్ని విషయాలు

కేవలం తార్కికంగా ఆలోచిస్తే తేలేదికాదు. ఆ అవసరం కూడా లేదేమో. హృదయంలోని ఏవో అనుభూతులు మన ప్రవర్తనకి కారణమౌతాయి కొన్ని సమయాల్లో. అది హేతుపూర్వకంగా ఉండకపోవచ్చు సమర్థనీయం కూడా కాకపోవొచ్చు కాని హృదయంలోని ఆ అవ్యక్తభావాలని కాదనటానికి వీల్లేదు.

డాక్టర్ ప్రవర్తనగురించి తను సందేహంగా చెప్పినప్పుడు ఆమెలో కలిగిన ఘోరణి తిరుమర్చిపోలేదు. ఆమె ఆలోచించటం మానేసింది. హృదయం మూగగా ఏదో పలికింది. లేకపోతే ఆమె అలా ఆవేశంగా మాట్లాడేదికాదు. ఆక్షణంలో తన హృదయం స్పందించినంతగా హృదయాన్ని ఊపివేయగల సన్నివేశం తన జీవితంలో ఇంతవరకు జరగలేదు. పద్మ వ్యక్తిత్వం తనకిప్పుడిప్పుడే తెలుస్తోంది. అంతగా తన వ్యక్తిత్వాన్ని అర్థం చేసుకోవడంవల్లే డాక్టర్ మీద ఇతర్ల అభిప్రాయాల్ని తృణప్రాయంగా తోసి ఉదాత్తంగా వ్యవహరించగలిగింది. పద్మలా ఎంతమంది ఉంటారు!

కాసేపు అలాగే ఆలోచిస్తూ కూర్చున్నాడు విశ్వం. ఆలోచనల్లో వసంత జ్ఞాపకం వచ్చింది. పదిహేను రోజులైనా అయివుంటుంది తనామెను చూసి. బయటికి వెళ్ళి కాస్త కాఫీ తాగి అలా వసంత ఇంటికి వెళ్ళాలనుకున్నాడు విశ్వం. కాని ఇంతలో మనసు మార్చుకున్నాడు. రైల్లో నిద్రలేక కళ్ళు బరువుగా వున్నాయి. సాయంత్రం వెడితే కులాసాగా ఉంటుందనుకున్నాడు.

సాయంత్రం కాగానే ఆకాశంలో మబ్బులు అలుముకోసాగాయి. సన్న జల్లుకూడా ప్రారంభమయింది. అయినా విశ్వం బయల్దేరివెళ్లాడు. తలుపు తట్టబోయేసరికి అతనికి లోపలనించి ఏవో మాటలు వినిపించసాగాయి. ఆగాడు. మాటలు రానురాను స్పష్టంగా వినిపించసాగాయి. వసంత కంఠం తీవ్రంగా వినిపిస్తోంది. ఉన్నట్టుండి చెంప ఛెళ్ళుమన్న శబ్దం వినిపించింది. దడాలున తలుపు తోసుకుని లోపలికి అడుగుపెట్టాడు విశ్వం. దండకాడిన భుజంగంలా ఉంది వసంత. పక్కన వెంకటేశ్వరరావు కందగడ్డలాంటి వదనంతో నుంచున్నాడు. చప్పుడు విని ఇద్దరూ తలుపువైపు చూశారు.

"ఏమైందిక్?" అన్నాడు విశ్వం ఇద్దరివైపూ చూస్తూ.

వెంకటేశ్వర్రావు ముఖం మరింత ఎరుపెక్కింది.

"చెయ్యి పట్టుకున్నాడు దుర్మార్గుడు," అంది వసంత రోషంతో.

"పతివ్రత, పాపం" అన్నాడు వెంకటేశ్వర్రావు హేళనగా.

"షటప్" అన్నాడు విశ్వం ఒళ్ళుమరిచి.

"విశ్వంగారూ, మర్యాద ఇచ్చి పుచ్చుకోండి. మీకు పరిస్థితులు తెలియవు. ఎంతసొమ్ము తగలేశానో, దీనికింతవరకూ."

"ఎవరికి?" అంది వసంత రెట్టిస్తూ.

"చెప్పాలా?"

"నేను మీ బహుమతి ఒక్కటికూడా ముట్టుకోలేదు. ఎప్పటికప్పుడే తిరగొట్టినా విన్లే—" వసంత పూర్తిచెయ్యలేదు.

"మీవాళ్లకిస్తే ఒకటి నేనిస్తే ఒకటేనా?"

"నాకు వాళ్లతో సంబంధం లేదు"

వసంత కళ్లలో నీళ్లు తిరిగాయి.

"ఇదేనా మీ నాటక కళోపాసన?" విశ్వం వెంకటేశ్వర్రావువైపు అసహ్యంగా చూస్తూ అన్నాడు.

"మీ చిత్ర కళోపాసన సంగతేమిటో!"

విశ్వం నిరుత్తరుడయాడు ఒక్కక్షణం.

"గురువింద గింజ తన నలుపెరగదట!"

"ఇకేం దౌర్జన్యాలు చెయ్యలేదు గెటౌట్" గట్టిగా అరిచాడు విశ్వం.

"తిరుక్ దయచెయ్యండి" అన్నాడు వెంకటేశ్వర్రావు వ్యంగ్యంగా.

విశ్వం చెయ్యి చేసుకోటానికి సిద్ధమయాడు.

"సిద్ధమే"

వసంత కలగచేసుకుంది.

"వెంకటేశ్వర్రావుగారూ, మా ఇంట్లోనుంచి వెళ్ళిపొమ్మంటున్నాను. పెద్దమనిషితరహాగా ప్రవర్తించలేరా?"

ఏమనుకున్నాడోగాని వెంకటేశ్వర్రావు "ఆల్ రైట్" అని వెళ్ళిపోయాడు.

"ఇది ఎల్ ప్యాసయాడు లేపోయాడో ప్రాక్టీస్ పెట్టబోతున్నాడు ఏంఖర్మయిది?" అన్నాడు విశ్వం జుగుప్సగా.

"కొందటినించి ఆయన ప్రవర్తన అటువంటిదేనండీ నేను భరిస్తునే వస్తున్నాను ఇలాంటిదేదో జరుగుతుందని" గాద్గదికంగా అంది వసంత

విశ్వం ఏమీ అనకుండా కుర్చీలో కూర్చున్నాడు కేకపిలని తో వేలం తిరుగుతున్నా అతివినూనె పీపలో గోచరించింది విశ్వం తలపట్టుకున్నాడు

"అసలు బహుమతులు ఎందుకు తీసుకున్నావు?"

"నేను తీసుకోంకే!"

"ఎవరికో ఇవ్వాలంటున్నారుగా"

"దానికి నేను బాధ్యురాల్నా?"

"మీ వాళ్ళెటగా?"

"అయినా వాళ్ళకీ ఏం సంబంధంలేదు నేను వేరే వుంటున్నానని మీకు తెలుసుగా?"

"అయితేమాత్రం, చెప్పలేనివాళ్ళకి నీవు లేదా? ఈ మాత్రం విషయం కూడా మరొకరు చెప్పాలా?"

కోపంగా అన్నాడు విశ్వం వసంత కళ్లలో నీళ్ళు తిరిగాయి

"తెలిసికూడా మీరలా మాట్లాడితే ఎలా?" అందామె గాద్గదికంగా

విశ్వానికి జాలేసింది ఆమెని కోపగించుకోటానికి తనెవరు? తనకేం హక్కుంది? అయినా ఆమె అలా తిరస్కరించకుండా తనకి సమాధానాలు చెబుతోంది అన్నిటికి పుల్ఫించి అందరూ ఆమెని బాధపెడుతుంటే ఎలా తట్టుకుంటుంది?

"వసంతా!" అన్నాడు కారుణ్యం ఉట్టిపడే స్వరంతో ఆమె కళ్ళెత్తి చూసింది

"ఆడుతు పేదాళ్ళు లేనివాళ్లని ఆదరించటం మాని వాళ్ళ నిస్సహాయస్థితి ఆధారంగా తీసుకుని స్వప్రయోజనాలు సాధించుకునే వాళ్ళ చేయటాలు తెలియటంలేదు."

"తో జేట్స్" అనేటం అంచుకోలేక అందివసంత

సరిగా తన మనసులో ఉన్నదే ఆమె అంది. అమాటే అన్నాడు విశ్వం ఆమెతో. అలా ఇద్దరి మనసుల్లో ఒకేమాట తోచటం అదే మొదటిసారి అని ఇద్దరూ ఒకరికొకరు చెప్పుకున్నారు

సన్నజాజుల చిలి చిలి గాలివానయింది. ఉరుములూ, మెరుపులూ, వానా, గాలితో ప్రకృతి భీభత్సంగా ఉంది

"ఇక్కడే చిక్కుపడ్డామే" అన్నాడు విశ్వం

"తొందరపని ఉందా?"

"ఏం లేదులే"

"మరయితే నష్టం ఏముంది? ఏమైనా చెప్పండి. వింటాను"

"అనగా అనగా ఒకరాజు - చెప్పాలా?"

"వేళాకోళం కాదండీ"

"బొమ్మ వేస్తుంటే బావుంటుంది. ఎన్నాళ్ళకీ అది పూర్తి కావటంలేదు"

"ఇవ్వూడా?" అంది వసంత,

"ఏం? మోడల్ ఇవ్వటానికి ఓపిక లేదా?"

"మీకు కోసం కష్టంకాదేమోగాని, ఎన్నాళ్లిండీ మోడల్ ఇచ్చేది?"

"నిన్న ముందరే చెప్పానుగా బాగా వెయ్యాలంటే కొన్ని నెలలు తీసుకుంటుంది ప్రతిబొమ్మా"

"మీకు సెలవలేగు హైదరాబాద్ వెళ్ళి ఇన్ని రోజులు కాలేదుగదా? ఉద్యోగస్థులైతే బొమ్మ పూర్తి కాకుండానే వెళ్ళిపోతారు"

"ఉద్యోగం పోయేదేముంది ఏమీ లేదు"

"ఎందుకు రాదు?"

"ఇన్ని దరఖాస్తులు పెట్టాను, ఒక్కరూ కనీసం ఇంటర్వ్యూకైనా పిలవలేదు"

"అవుతుంది లెండి." అని ధైర్యం ఇచ్చిందామె

విశ్వం పరికరాలు తీసుకున్నాడు వసంత మోడల్ ఇస్తోంది

బయట హోరుగాలి కుంభవృష్టి

కను ముక్కు తీరు సరిదిద్దుతున్నాడు విశ్వం తలుపుకున్న మెరుపు మెరిసింది కిటికీలోంచి ఆకాంతి సరిగా వసంతమీద ప్రసరించింది

"మెరుపు మెరిసి మీరు జారిపడారనుకున్నాను" అన్నాడు విశ్వం చిరునవ్వు నవ్వుతూ.

"మీరు కవిగారు కాలేకదూ? బొమ్మ గీసుకోండి కవిత్వం కోలిపోకుండా" అంది వసంత.

చేసిన ఒక్క చెడ్డపని చెప్పమంటే తను ఆలోచించుకోనక్కర్లేదు మంచిపని చెప్పమంటే—అదేపూర్వపు సమాధానమే వేసిన చోటే గొంగళి

ఒక్క మంచిపని!

విశ్వానికి చటాలున ఆలోచనతట్టింది. వసంతని తను పెళ్ళిచేసుకుంటే! ఒక అబలని, దురాచారానికి బలికాకుండా తప్పించుకోవాలని తాపత్రయపడే ఒక కన్యని ఉద్ధరించినట్లవుతుంది అంతకంటే ఎవరు మాత్రం చెయ్యగల గొప్ప మంచిపనేముంటుంది? తను వసంతని వివాహం చేసుకుంటాడు

కాని అది అంతసులభమా? ఎన్ని అవాంతరాలు దాటాలో! ఎన్ని చిక్కులొస్తాయో! అన్నట్టు మానాన్న కల్యాణిని పట్టుబడితే! ఒక వేళ వాళ్ళకి తనకే చేసుకోవాలని ఉంటే! ఈ పరిస్థితుల్లో తనేం చెయ్యాలి ఏం చెయ్యగలడు? పైగా ఈ వివాహానికి ఇంట్లో ఒప్పుకోరు. వేరేచోట ఇంట్లోంచి వెళ్ళిపోయి పెళ్ళి చేసుకోవాలి. బహుశా మళ్ళీ ఇంట్లో అడుగు పెట్టనివ్వగా ఉద్యోగం అయితే పరవాలేదు. కాకపోతే తనెలా ఆమెని పెళ్ళిచేసుకోగలడు!

కాని వసంత అలా సంఘర్షణలో నలిగిపోతుంటే ఎలా ఊరుకోగలడు? తనామెని ఉపేక్షించలేనంత నిస్సహాయుడా? నరేశ్వరావులాంటి తోడేళ్ళ బారినించి ఆమె తన్నుతానెలా రక్షించుకుంటుంది, పాపం

విశ్వానికి ఎటూ తేలలేదు రాత్రంతా ఆలోచనలతోనే కాలం గడిచింది తెల్లారేసరికి కళ్ళు ఎర్రబడి ఉన్నాయి తల దిమ్మెక్కింది వర్షంలో తడవటంవల్ల ఆరోగ్యంకూడా దెబ్బతింది ఒంటరిగా ఉన్నప్పుడల్లా రాత్రిజరిగిన సంఘటనే మనసులో మెదుల్తోంది

విశ్వం ఇలా ఆలోచిస్తుండగా రంగనాథంగారు ఓ ఉత్తరం తెచ్చి అతనికిస్తూ "ఏమిట్రా ఇది?" అన్నారు ఆ ఉత్తరం మొదటి పంక్తి చూడగానే అతనికి ప్రాణం పైకిపోయింది. అది ఆకాశరామన్న ఉత్తరం లోకల్ డెలివరిలో వచ్చింది విశ్వానికి వసంత అనే నాటకాల్లో వేషాలువేసే అమ్మాయితో సంబంధం ఉందనీ, వాళ్ళు పెళ్లి చేసుకోబోతున్నారనీ హెచ్చరించాడు, ఆకాశరామన్న ఇది నరేశ్వరావు పనే అయి ఉంటుందని వెంటనే ఊహించాడు విశ్వం

"శుద్ధ అబద్ధం" అన్నాడు విశ్వం ధైర్యంగా.

"నువ్వు రోజూ పొద్దుపోయే ఎక్కడికి వెళ్తేది?"

విశ్వానికి నిజంచెప్పాలో అబద్ధం చెప్పాలో తెలియలేదు ఎందుకైనా మంచిదని నిజమే చెప్పాడు.

"ఆ అమ్మాయి ఇంటికి"

"బొమ్మవేస్తున్నాను దానికి మోడల్ కావాలి. ఇంటిదగ్గిర బావుండదని అక్కడికి వెళుతున్నాను."

ఈ సమాధానానికి రంగనాథం కొంచెం వెనక్కి తగ్గాడు

"ఇహనించీ అది మానుకోటం మంచిది. ఏమంటావు?"

"బొమ్మ పూర్తికావొద్దూ?"

"అక్కర్లేదు"

"అయితే సరే"

"ఒకవేళ నువ్వేమైనా మనసులో ఆ పిల్లని పెళ్ళిచేసుకుందామని అనుకుంటున్నావేమో అలాంటివి మాకు నచ్చవు నీదారి నువ్వు చూసుకోవాలి వింటే ఆ పతంలో ఆనర్స్ ప్యాసయినవాడివి నీకింతకంటే ఏం చెప్పక్కర్లేదు"

ఆ మాటని ఆయన వెళ్ళిపోయాడు విశ్వం దీర్ఘంగా నిట్టూర్పు విడిచాడు తను రాత్రి అనుకున్నాడో లేదో, అప్పుడే విఘ్నాలు మొదలు. ఈ కుళ్ళిపోయిన సంఘంలో ముందడుగు వెయ్యటం సాహసకార్యమే. కాని తను హేతువాదానికి నిలబడాలి తను చెయ్యగలిగింది తప్పక చెయ్యాలి వసంతని తను పెళ్ళిచేసుకుని తీరాలి జీవితంలో అవకాశాలు సులభంగా రావు. వొచ్చిన దానిని సద్వినియోగం చేసుకోవాలి

ఆ సాయంత్రం వసంత ఇంటికివెళ్లి తన నిశ్చయం చెప్పాలనుకున్నాడు విశ్వం కాని ఆమె ముఖం చూడటానికి సాహసం చాలక మానుకున్నాడు. ఉత్తరం రాద్దామని ఆలోచించాడు. కాని ఉత్తరాలు ప్రమాదకరమని రాయలేదు

ఈ సంఘటన జరిగిన తరవాత విశ్వానికి ఇంట్లో మెసలటం కష్టం అనిపించింది తనని ఆదోలాగా చూస్తున్నారు అదికాక తను రెక్కలు వచ్చి ఉద్యోగంలో ఇంకా చేరలేదు తనమీద నిర్లక్ష్యభావం ఇంట్లోవాళ్ళకి ఏర్పడసాగిందని అతను భావించాడు.

# అంతర్వాహిని

అదృష్టవశాత్తూ తను విజయవాడలో ఒక ఆఫీసులో ఉద్యోగానికి పెట్టిన దరఖాస్తుకి ఫలితం దక్కేలా ఉంది ఇంటర్వ్యూకి రమ్మని రాశారు. విశ్వం ఏమీ ఆలోచించకుండా వెంటనే బయల్దేరాడు, పెట్టేబేడా సర్దుకుని ఉద్యోగం చిన్నదే, అయినా తాత్కాలికంగా చెయ్యవచ్చు అనుకున్నాడు రంగనాథంగారేమీ అడ్డుచెప్పలేదు. ఈ ఊరినించి వెడితే అమ్మాయి వ్యవహారం కూడా పరిష్కారమైపోతుందని ఆయన భావించాడు అందువల్ల ఏదో ఓ ఉద్యోగం ఎక్కడ దొరికినా సరే వెళ్ళటం మంచిదని ఒక సాధారణ సలహా ఇచ్చాడాయన. విశ్వానికి ఆ సలహా కొంచెం కష్టంగానే ఉంది తను ఇంట్లో ఊరికే ఉండటంవల్ల అలా తండ్రి అభిప్రాయపడ్డాడని అతను అనుకున్నాడు

విశ్వం దరఖాస్తుపెట్టింది ఒక రాజకీయపార్టీ ఆఫీసులో అకౌంటెంట్ పనికి ఇంటర్వ్యూలో కార్యదర్శి ఏవేవో ప్రశ్నలడిగి చివరికి విశ్వంవైపు దీక్షగా చూసి అన్నాడు

“రవు అనేపేరు బ్రాహ్మణేతరదండీ పెట్టుకునేది?” ఆ ప్రశ్నలోని భావం వెంటనే విశ్వానికి అర్థంకాలేదు

“ఈ రోజుల్లో అందరికీ అది మామూలుగా ఉండేపేరే గదండి” అన్నాడు

కార్యదర్శి విశ్వంవైపు చూస్తూ ఏదో అనటానికి సంకోచిస్తున్నాడు

“మీగారు ?” అంతవరకే ఆయన అడిగాడు, విశ్వం సమాధానంకోసం ఎదురుచూస్తూ

అర్థమైంది విశ్వానికి అతనిముఖంలో అసహ్యం తాండవించింది. ఈ మనిషికి రెండుముఖాలు గట్టిగా అడిగే ధైర్యం ఆయనకిలేదు కులతత్వాలకి అతీతుడనుకోవాలి ప్రజలు. అడక్కుండా ఉండలేడు తన కులంకాకపోతే ఉద్యోగం ఇవ్వడు. అంతవరకు న్యాయం “మంచిచెడ్డలు రెండేసేలాలు అన్నాడు కదూ కవి! మరి నామంచినిగురించి నేను చెప్పుకో కూడదు” అన్నాడు నవ్వుతూ కార్యదర్శి ముఖం చిట్లించుకున్నాడు అలా చిట్లించుకుంటాడని విశ్వానికి తెలుసు అయినా వచ్చే సమాధానం తినదగియుంటే సూటిగా చెప్పనేనాలేదని కార్యదర్శి ఊహ! అలాంటి ఆఫీసులో ఉద్యోగంఇచ్చినా తనకక్కర్లేదు. అయినా పైకి కనపడనివ్వకుండా ఏవో ఒకటిరెండు విషయాలు మాట్లాడి ఇంటర్వ్యూ ముగిస్తూ “వెళ్ళిరండి” అన్నాడు కార్యదర్శి

“ఫలితం ఎప్పుడు తెలియచేస్తారు?”

“పోస్టులో తరవాత పంపిస్తాం- సెలెక్టయితే”

వెళ్ళాడు విశ్వం ఆ తరవాత కుతూహలంకొద్దీ ఆఫీసులో విచారిస్తే ఆ ఖాళీ భర్తీ అయిందని తెలిసింది. కొత్త ఉద్యోగి కార్యదర్శిగారి స్వకులస్థుడేట! బి.ఎ తప్పాడట!

విశ్వం ఓగది అద్దెకు తీసుకుని ప్రతిఆఫీసు తిరగసాగాడు ఎంప్లాయిమెంట్ ఎక్స్చేంజిలో పేరు నమోదు చేయించుకున్నాడు కనీసం లోయర్ డివిజన్ గుమాస్తా అయినాసరేనని ఆఫీసర్ గారితో చెప్పాడు. ఒక ఆఫీసులో ఉద్యోగం వచ్చినట్టే వచ్చి పోయింది. పొద్దునవచ్చి పనిలో చేరమని అధికారంగా చెప్పాడు మేనేజర్ ఇంటికి ఉత్తరంకూడా రాసేశాడు ఉద్యోగం వచ్చిందని. కాని ఉదయం ఆఫీసుకి వస్తే సరికి మేనేజర్ తన విచారం తెలియచేశాడు కొన్ని పరిస్థితులవల్ల ఆ ఉద్యోగం మరొకరికి అకస్మాత్తుగా ఇవ్వవలసొచ్చిందని చెప్పాడు కాళ్ళీడ్చుకుంటూ నిరాశతో వెళ్ళిపోయాడు విశ్వం.

ఇంటినుంచి తెచ్చిన డబ్బు అయిపోవచ్చింది. ఉద్యోగంవచ్చే ఆశ ఏమీ లేదు తిరిగి ఇంటికి వెళ్ళటానికి అతని అభిమానం అడ్డొచ్చింది ఏ ఉద్యోగమైనా సరే చేరటం మంచిదట! పూట గడిచేది ఏదైనా సరే తను చేరవలెననుకున్నాడు కాని ఆశలన్నీ అడియాసలౌతున్నాయి కాఫీ మానేశాడు టిఫిన్ మానేశాడు భోజనంలో పెరుగు మానేశాడు తరవాత ఒకపూట భోజనం మానేశాడు ఏదో ఒక టిఫిన్ భోజనం బదులు తీసుకునేవాడు తరవాత రెండుపూటలు అలాగే చేశాడు

అర్ధాకలివల్లా, నిరాశవల్లా పట్టుదల సడలజొచ్చింది కాని అభిమానం ముందుకొస్తోంది. ఏ ఉద్యోగమైనా సరే! ఆనర్స్ ప్యాసైనట్టు ప్రొవిజనల్ సర్టిఫికేట్లు చేతిలో ఉంది. కనీసం తిండిపెట్టే స్తోమతు దానికి లేదా?

డబ్బు తగ్గిపోతున్నకొద్దీ దాని విలువ మరింత ఎక్కువైపోతోంది. ఒకపూటే టిఫిన్ తీసుకోసాగాడు.

"పరిస్థితులు ప్రశాంతంతే" అన్నాడతను.

"పోదాం పద."

"ఎక్కడికి?"

"ఇంటికి"

"ఇల్లా?"

"అవును రెండు గదులిచ్చింది ఇక్కడ ఉంటున్నాం. తరవాత చెబుతాలే పద."

"తర్వాత వొస్తాలే"

"నిన్నిలా వొదిలివెళితే వదినా నీ అభిప్రాయం?"

"వాడు రూమ్ కింది"

"ఉంటే ఉండిలే"

విశ్వం కాసేపు తటపటాయించి "పదే పద" అని రెండడుగులు వేశాడు రిక్షావైపు అతని కాళ్ళు తేలిపోయాయి.

"విస్పష్టంగా ఉంది జానకీ" అంటూ వెనక్కి తిరిగాడు, అరటిపళ్లకోసం.

అరటిపళ్లు ఒక వరాహం కబళిస్తోంది

"అయ్యో!" అన్నాడు విశ్వం అప్రయత్నంగా

"ఏమిటి బావా?" అని వెనక్కి తిరిగి చూసింది జానకి

"తినటానికైనా ఉంటే బాగుండును!" హీన స్వరంతో అరటిపళ్లవైపు చూస్తూ అన్నాడు విశ్వం

తన కొంగు ఎదరో గట్టిగా గుప్పిటలో బిగించిపట్టుకుంది జానకి

రిక్షావాడికి డబ్బిచ్చి దగ్గరకెళ్ళిపక్కనే తొందరగా పట్టుకురమ్మని చెప్పింది

"ఎందుకూ, పోనీలే బావా. ఇదిగో, నా దగ్గర ఒక అణా ఉంది" జేబులో చెయ్యిపెట్టి అణా తీసి రిక్షావాడివైపు చూశాడు. వాడంతకుముందే వెళ్ళిపోయాడు.

విశ్వం చేతిలోఅణాఅలాగే పట్టుకునిశూన్యంగా జానకివైపు చూశాడు.

"అణా ఉందా బావా?"

"ఉంది జానకీ, ఇదిగో" అమాయకంగా చూపించాడు విశ్వం.

జానకి కళ్ళలో నీళ్లు గిర్రున తిరిగి చెంపలమీదికి టపటప జారాయి.

అణా ఉందట

ఆఖరి అణా

పోదా అరటిపళ్లకోసం

"అరటిపండు మాత్రం ఇక్కడ జానకీ నాకు దగ్గరకెళ్లి తిన్న పాదాని ఇష్టం లేదు" అన్నాడు విశ్వం బాల ఒకసారి.

"పోదాం చాలు జానకీ" అంటున్నాడు వీగో.

ఆ దైన్యం భరించలేకపోయిం దామె దుఃఖం ఆమెలో పొంగిపొర్లింది పంటకొంగుల్లో కుక్కుతూ ఆమె కనుకొలకులలోంచి కన్నీటి బింగువులు చెంపల జారుతుంటే తదేకదృష్టితో ఆ దృశ్యం చూస్తూ నిలబడి పోయాడు విశ్వం

## 14

గవర్నమెంటు జనరల్ ఆస్పత్రిలో స్పెషల్ వార్డులో పడుకుని ఉన్నాడు మూర్తి తలకి కట్టు కట్టి ఉంది అతని ముందు పక్కనే ఒక స్టూల్ మీద కూర్చున్నాడు విశ్వం జానకి మూర్తి తలవైపు కూర్చుని ఉంది

"ఏమిట్రా ఈ ఉపద్రవం?" అడిగాడు విశ్వం.

"జానకి చెప్పలేదా?"

"చెప్పిందిలే కాని నువ్విప్పుడు చెప్పగలిగే స్థితిలో ఉన్నావుగా ఏం జరిగిందో చెప్పు. ఫస్ట్ హాండ్ ఇన్ఫర్మేషన్ కావాలి."

"ఏముంది, మామూలు గొడవలే"

నువ్వు లోక్యం కలిగించుకునేవాడివి కావుగా"

"ఈసారి కలిగించుకున్నాను"

"ఎందుకలా?"

"ఏం చేస్తాం! ఊరు మొత్తం కొట్టుకుంటుంటే!"

"ఏం జరిగిందేమిటి?"

"పంచాయితీ ఎన్నికలు జరుగుతున్నాయి కదూ. ప్రెసిడెంటు పదవికి ఇద్దరు పోటీచేయదలుచుకున్నారు మా ఊళ్లో ఇంకేం తగాదాలు, కొట్లాటలు మొదలు".

"నువ్వే పార్టీ?"

"నాకు పార్టీ ఏమిటి?"

"మరి దెబ్బలెందుకు తగిలాయి?"

"చెప్పేది విను. మునసబుగారబ్బాయీ, నేనూ స్నేహితులం. నేను సామాన్యంగా పేచీ వ్యవహా

రాల్లో కల్పించుకోను. కాని అతని పరిస్థితులు మరీ విషమించేట్టున్నాయి, ఏదో చెయ్యాలని పదుం కట్టాడు. చూస్తూ ఎలా ఊరుకోను? ఒంటరిగా నేం చేస్తాడు! ఇద్దరం కలిసి ఒక అభ్యర్థిని పోటీనించి విరమింపచేయాలని ప్రయత్నించాం. ఇద్దరికీ మా మీద అనుమానం ఏర్పడ్డది. మేమేదో మూడో పార్టీ పేరి ఓట్లు మావైపు తిప్పుకోవాలని చూస్తున్నామని వాళ్లూహించారు"

"మన విదేశాంగ విధానంలా ఉంది నీకథ"

"చివర మారిందిలే. నేను మరి మూడో పోటీదారు వచ్చాడనుకునే సరికి వాళ్లిద్దరూ ఏకమయ్యారు. ఇదరూ కలిసి ఏదో సంప్రదించుకున్నారు. పోటీ తప్పిపోయింది. కక్షలు తగ్గిపోయాయి. అంటే నా ప్రయత్నం సఫలమైందన్నమాట. నాకేదో సన్మానం జరుగుతుందని తెలుసులే'

"శుభం. కాని దెబ్బల సంగతేమిటయ్యా మహాప్రభూ?"

"అదే సన్మానం కావాలని రెచ్చగొట్టానులే. అయితే ఇంత పని జరుగుతుందని అనుకోలేదు. ఏదో గొడ్డిలో పోనిస్తారనుకున్నాను"

"నువ్వు చెప్పేది నాకేమీ అర్థం కావటం లేదు."

"అర్థం కానిదేముంది? పోనీ ఇంకొంచెం వివరంగా చెబుతాను. వాళ్ళు పోటీ విరమించుకోమని మంచిగా చెబితే వినలేదు. వినరని ముందే తెలుసులే. అందుకని ఈ మూడో పక్షం గురించి పుకార్లు లేవదీశాను. అక్కడా అక్కడా వాళ్లని గురించి నేనేదో అన్నట్టు కల్పించాను. దాంతో వాళ్లకి ఉద్రేకాలు పెరిగాయి. ఏమయితే ఏం? ఊళ్లో పేచీలు తప్పిపోయాయి ప్రస్తుతానికి"

విశ్వం మూరివైపు ఆశ్చర్యంగా చూశాడు

"అయితే సాహసించి కావాలని అభాండాలు నెత్తిన వేసుకున్నావా?"

"మరి ఏంచెయ్యను? లేకపోతే ఆ ఊళ్లో బతకటం మరీ కష్టం. నీకు తెలుసుగా. గలాటాలంటే నాకు చెడ్డ తలనొప్పి"

"నిన్ను కొట్టినవాళ్ళెవరు?"

"ఎవరయితే ఏంలే"

"అదేమిటి? క్రిమినల్ కేసు పెట్టి జైల్లో పెట్టించి వాడి పాట్లు వాడికి కరపకుండా ఉంటారా?"

"నీకు తెలియదులే బాబా. ఈ గొడవంతా, ఆ కోర్టు గొడవలు లేకుండా చెయ్యటానికేగదూ ఇంత శ్రమా పడ్డది."

విశ్వం మూరివైపు అర్థం కానట్టుగా చూశాడు

"అయితే వాడిని వొదిలేసావా?"

"లేకపోతే వాడిమీద నాకు కక్షేమిటి? వాడు ఎదురుగా వస్తే ఎడంచేత్తో కాలర పట్టుమీదికి వివి తెయ్యగలను. బుద్ధి తక్కువపని చేశానని ఏదో ఏదో అంటూ ఉంటాడీపాటికి"

"నీది గాంధీగారి పద్ధతిలా ఉంది"

"నాదెవరిదీ కాదు. అది నా స్వభావం అంతే,"

"సుజనపద్ధతి అంటారే."

"అదిగో, అదే నాకు నచ్చనిది. నేను వాళ్లకోసమా, వీళ్లకోసమా ఏది చెయ్యలేదంటే నమ్మరేం? నాకో ఊరుంది. ఆ ఊళ్ళో నేను జీవితం గడపాలంటే అందుకు తగిన వాతావరణం సాధ్యమైనంత వరకూ కల్పించుకోవాలి. దీనికేమిటో పేర్లు పెడతారేం! ఇంతా చేస్తే, ఈ మూడోపక్షం సంగతి ఆ ముసలమ్మగారబ్బాయి టపాకాయలా పేల్చేస్తాడేమోనని భయంగా ఉంది. ఎరక్కపోయి అతనికి చెప్పాను. ఊళ్లో అప్పుడే నేనేదో తంత్రం పన్నానని గుసగుసలుగా ఉందిట. నాన్న చెప్పారు. అసలు ఈ మనుషులకి పొగడ్తలంటే మహా ఇష్టం"

గబగబ మాటాడటంతో మూరికి కొంచెం ఆయాసం వొచ్చింది. జానకి అతనిని మాట్లాడవద్దని హెచ్చరించింది.

విశ్వం మూరివైపు ప్రశంసా పాత్రంగా చూడసాగాడు. ఏదో పొగడ్తగా అనబోయినవాడల్లా మూరి అన్న చివరిమాటలు విని నోరు తెరవకుండా ఊరుకున్నాడు. మూరిని తను చిన్నప్పటినించీ ఎరుగు. వాడింత ఘటికుడని తను అనుకోలేదు, తను వాడినించి నేర్చుకోవాలిసింది చాలా ఉంది!

మరి కాసేపటికి వెంకట్రామయ్యగారు వచ్చి "మీరిద్దరూ ఇళ్ళి భోజనం చేసిరండి. నేను మీరొచ్చేదాకా మూరి దగ్గర ఉంటాను" అన్నారు.

జానకీ, విశ్వం అన్నట్టే బయటికొచ్చారు. దూరంలో జానకి మారిపోయాక్క వెంకటపతి వృత్తాంతంతో సహా అంతా చెప్పింది విశ్వానికి అదంతా చాలా కొత్తగా ఉంది మారి ప్రవర్తనవిజంగా ఆశ్చర్యం అనిపించిందతనికి తను మారిని పైచదువుకి వెళ్ళమని ప్రోత్సహించాడు, చదివితే మారి బాగుపడేవాడే వ్యక్తిగత అభ్యున్నతి దృష్ట్యా కావి ఊరు పాతకాలంలోలాగే ఉండేది

భోజనంచేసి వసార కుర్చీలో పడుకున్నాడు విశ్వం అతని మనసులో ఏవేవో ఆలోచనలు కదిలాయి. జానకి చాపమీద కూర్చుని ఏదో పనిచేసుకుంటోంది

ఆమెవైపు యథాలాపంగా చూశాడు విశ్వం ఆమె వదనంలో ప్రశాంతత తొంగిచూస్తోంది తనని దౌర్భాగ్యస్థితిలో చూసినప్పుడు ఆమె ముఖంలో ఎంత ఆవేదన ప్రస్ఫుటమైంది! పొంగి పొర్లే దుఃఖాన్ని ఆమె బలవంతాన ఆపుకుంటుంటే ఆ గుండెలంత కన్నీరై కలిమిదికి జారే దృశ్యం అతని మనోవీధిలో మెరిసింది అది విపరీత పరిస్థితే కావచ్చు; కాని తను కష్టంలో ఉంటే అంతగా ఆమె బాధపడవలసిన అగత్యమేమిటి?

అకస్మాత్తుగా విశ్వం భావవీధిలో ఏదో వెలుగు గోచరించింది జానకి తనని ప్రేమిస్తోందా? ఎలా ఈ విషయం తెలుసుకోవటం ఒక వేళ ఆమె తనని ప్రేమిస్తే జీవితంలో ఒక గొప్పసమస్య తను ఎదుర్కోవాలి. పరిస్థితులు శ్రుతిమించకముందే నిజం తెలుసుకుని సమయోచితంగా ప్రవర్తించాలి సరాసరి ఈ ప్రశ్న జానకిని అడిగితే? ఆమె ఏమనుకుంటుందో! ఇప్పటికే ఒకసారి ఒక వ్యక్తి ఇచ్చిన చనువుదుర్వినియోగం చేసుకున్నాను డొంక తిరుగుడుగా ఆమెచేత విషయం బయటపెట్టించాలి.

"జానకీ"

"ఏమిటి బావా?"

"వ్యక్తిలో ఎటువంటి గుణాలు నీకిష్టం?"

"మంచి గుణాలు." ఇదికూడా ఓ ప్రశ్నేనా అన్నట్టుగా జానకి సమాధానం చెప్పింది

"చెడుగుణాలుగల మనిషైతే?"

"బాధగా ఉంటుంది."

"అది సరే. అటువంటి వ్యక్తి పట్ల నీ ప్రవర్తన ఎలా ఉంటుంది?"

"ఇప్పుడెందుకా సంగతి?"

"కావాలి."

"ఆ సందర్భంలోగాని తెలీదు"

"నేను తాగుడు అలవాటుచేసుకుంటాననుకో"

"బాగా చివాట్లు పెడతాను"

"అంతేగాని ఇంకేం చెయ్యవా?"

"వీలైతే బాగుచెయ్యటానికి ప్రయత్నిస్తాను"

"లేకపోతే?"

"ఒక దణ్ణంపెట్టి ఊరుకుంటాను"

"అంతేగాని అసహ్యించుకోవా?"

"గుణాల్నిగాని మనుషుల్ని అసహ్యించుకోటం ఎందుకూ?"

"నీకాబోయే భర్త అలా చేస్తాడనుకో"

"చాల్లెద్దూ, వేళాకోళం" అంది జానకి చిరుకోపంతో విసుగ్గా

"కాదు జానకీ చెప్పు"

"అప్పుడేంచేస్తానో వొచ్చి చూద్దువుగానిలే"

ఆమెవంక పరిశీలనగా చూశాడు విశ్వం.

"రానిస్తావా?"

"పరాయివాడివైనట్టు మాట్లాడతావేం?"

"రానిచ్చినా ఇటువంటి సంగతులు చెబుతావేమిటే," ఆమెవంక దొంగతనంగా చూస్తూ అన్నాడతను. జానకి ఏమీ మాట్లాడలేదు

"ఊరికే అన్నాలే జానకీ, నీకు మంచి మొగుణ్ణి వెతికి పట్టుకొస్తాంగా"

"పనీపాటా లేకపోతేసరి" అంటూ జానకి లేచి వెళ్ళిపోయింది

"వెళ్లకు, వెళ్ళకు, నీకు పుణ్యముంటుంది, ఒక్క సలహా ఇవ్వు జానకీ"

"నాకు సలహాలివ్వటం రాదు"

"పోన్లే చూడు, మనిషి ఏదైనా ఒక మంచి పని చెయ్యాలని నీకనిపించదూ?"

"ఒకటేమిటి, చాలా చెయ్యాలి"

"కనీసం ఒక్కటి కొంచెం ఆలోచించి చెప్పు. నేనేంచేస్తే బావుంటుందంటావు?"

"నీ ఇష్టంవచ్చింది చెయ్యి. కాలం తెలుస్తుంది".

# చంద్రశేఖరకవి ఆంధ్రామరుకము

శ్రీ వేదం వేంకటకృష్ణశర్మ

శృంగార నాయికానాయక విలాసవిభ్రమలీలా విధములను సాహిత్యపరముగ వెల్లడించు శతశ్లోకములకావ్యమీ 'అమరుకము'. ఏతత్కర్తృత్వ విశ్వసనీయ కములు విశ్వసింపఁదగు ఆధారము లేకుండెను. ఇంతదనుకఁ గావింపఁబడు పరిశోధనలు లోకకొండలేదు. అమరుకుఁడను కవి విరచితమనుచున్నారు. మరికొందఱు శ్రీ శంకరభగవత్పాద ప్రణీతమని నమ్ముచున్నారు. ఎవరైననేమి, వారి విద్వత్తామరుల నేగల మహాద్యములు శ్రోతృ బంగారములేని యిట్టివారి వాదములు గాలిమేడలు నేలవిడిచిన సాములు.

శ్రీ శంకరభగవత్పాదుల కీ కావ్యనిర్మాణ మంటఁగట్టువారికి టీకావ్యాఖ్యాతను క్కొటి ప్రమాణమొండాధారమయ్యెను. కాని, అదియొక కల్పకథ విశ్వసార్హము కాదు. అయినను పాఠకుల పరిశీలనమునకది పనికివచ్చునని యీ క్రింద నుట్టంకించుచున్నాను.

ఆజన్మ బ్రహ్మచారియగు శ్రీ భగవత్పాదులు మాతృజ్ఞనుకూడ నుల్లంఘించి, సన్యాసమును స్వీకరించి, సమస్త శాస్త్ర పారంగతుఁడై, అద్వైత సిద్ధాంత ప్రతిపాదకమగు శివగురిమను వ్యాపింపఁజేసినట్లు వారి జీవితచరిత్రము వక్కాణించుచున్నది. ఇట్లు లన్నికళలయందును ప్రావీణ్యము గడించిన ఆమహాత్ముఁడుకూడ చరితమనిక శృంగార మొక్కటే. అంతమాత్రమున అతని యామధిక్యమున నది లేకపోయినను కామశాస్త్ర రహస్యము లాతనికిఁ దెలియవని కాదఁ, తెలిసియు విపరీతయోజనములని యతఁడనుకొన్నది. ఆకథ నిట సూచించుట అప్రస్తుతము కాదనుకొందు.

అమరుకుఁడను భూపాలుఁడు మరణించెను. తత్పురమును చితిపైనుంచి దహన సంస్కారమొనర్పనుండగా దనిక కోశమును బహిష్కరించి కాని శంకరుఁ డాకపటమున జొచ్చెను. కొంతకాల మాయన అంతఃపురాంగనలతోఁ గేళీవిలాసముల దేలలాడుచు గాలక్షేప మొనర్చెను. రాణివాస స్త్రీజనము నృపాల కేళీగతి ప్రాణి స్వభావమును, ప్రవర్తనమును, వాలకమును నిశితముగ పరిశీలించి, యాతఁడు తమ భర్తయైన నరేంద్రుఁడు కాడనియు, నాతి దేహమున దూరిన మహాయోగిపుంగవుఁడు గానోపుననియు, గారణాంతరమున నవశిష్టుఁడు దాఁచి యుండెనని, యీ మేను ప్రవేశించెననియు, పరకాయ ప్రవేశాదికములు మహామహుల కలవనియు నిశ్చయించిరి. వెంటనే, రాణులు మంత్రులను రావించి, విషయమునెల్ల వివరించి చెప్పి, — రాష్ట్రమున వెదకి గాలించి, సంరక్షితదేహములున్నచోఁ దెప్పించి, కాల్పించివేయుఁడని కట్టడ గావించిరి. నరాధిపు నొపలి శాక్రయించి యున్న శంకరుఁ డది యెఱింగి రాట్శరీరము నుజగించి — చితిపై దహింపఁబడనున్న తనమేని కంగు శిష్యప్రేరితుఁడై చొరఁబడెను.

'కథ'కు కాళ్ళు, మంతకు చెవులు లేవని లోకోక్తి. కాని, కథకు కాళ్లు ఉన్నవి. లేనిచో నల్లెడ సంచరించు ప్రవృత్తి ఎక్కడిది? 'మంతకు' చెవులు లేవనుటకూడ నట్టిదే. దాని అంచులు చెవులుగాక మరేమి? అట్టిదే ఈకథకూడ. శ్రీ శంకరుని పరకాయప్రవేశము! — అదియు గామకళాభ్యాసార్థము!! కొంపను త్రిలింగ ఎలుకను పట్టినట్లున్నది — ఈకథా విషయము జీకావ్యసమును, ఆచార్య చరిత్రాంతర్గతమును, సర్వప్రమాణముఖస్థము — ప్రసిద్ధకెక్కిన యీకథ అమరుకకావ్యసృష్టికి ఆధారము కాని అవారణవశ తప్పగు ఇటిగానలు చారిత్రకాధారములతో నిశ్చితములని వాదించుట కడుంగడు ప్రమాదము. కావున ఎంతమాత్రమును విశ్వాసార్హము కాదు.

ఇదిఁ ప్రకృతము అమరుకకావ్యకర్త యెవ్వఁడయినను — ఇందలి విషయములు పరికింతము. అతఁడు అత్యంత ప్రౌఢకవితా ధురీణుఁడనియు, శృంగారకళా రహస్య పారీణుఁడనియుఁ దోఁచకమానదు. ఇందలి యొక్కొక్క శ్లోక మొక్కొక్క రత్నము, రసిక జనానంద సంధాయకములు ఈ కావ్యములోని శ్లోకములొక్కొక్కటిని తొమ్మిదవ శతాబ్దమునాఁటికి అనంద

# కలగూరగంప

## అప్రమిత్రుడు తెన్నేటి సూరి

శ్రీ పి. శ్రీరాములు

వారం రాకడా ప్రాణం పోకడా ఎవరికీ తెలియదంటారు.

అక్టోబరు 16 గురువారం అనుకుంటాను ఆ క్రితం రోజునుంచి ఎడతెరిపిలేని వర్షం. ఎక్కడికీ కదలడానికి వీల్లేదు. మధ్యాహ్నం రెండుగంటలయ్యేసరికి అశనిపాతంలాంటి వార్త అందింది. అప్రమిత్రుడు తెన్నేటి సూరి మరణించాడని విని నిలువుగా నీరైపోయాను. సూరి మరణించాడంటే నమ్మలేకపోయాను. అంతకు సరిగా రెండురోజుల క్రితం కూడా దానికి వెళ్ళినప్పుడు అయినవరంలోని అద్దెఇంట్లో మంచంమీద పడుకొని ఏదో వ్రాసుకుంటున్నాడు. ఆ బాధ మరణవేదనే అని గ్రహించలేకపోయాను. మరో ముప్పయిఆరు గంటలలో మృత్యుదేవత కబళించి వేయబోతున్నదని ఊహించలేకపోయాను.

ఆ బక్కపలచటి శరీరమూ, దానికి తగిన ఎత్తూ, కోటేరు వేసినట్లు కనిపించే ఆ పొడుగాటి ముక్కూ, విశాలమైన దర్పణాల్లాంటి తళతళ మెరిసే ఆ కళ్ళూ, ఆ కళ్ళలోనుంచి వెలువడే తీక్షణమైన చూపులూ, ఆ చూపులలో గోచరించే చురుకైన తెలివితేటలూ, మందహాసం విరజిమ్మే ఆ కోలముఖమూ మరిచిపోదామన్నా మరపురావు.

జీవించింది యాభైయేళ్ళలోపే అయినప్పటికీ అందులో సగభాగానికి పైగా తెన్నేటి సూరి సాహిత్యసేవకే వినియోగించాడు. కవిగా, కథకుడుగా నవలా రచయితగా, నాటకకర్తగా తెలుగుదేశంలో పేరూ ప్రఖ్యాతి ఆర్జించుకున్నాడు. తన పేరుతోనూ 'సీరపాణి' అనే మారుపేరుతోనూ అనేక రచనలు ప్రచురించాడు. వాటిలో మబ్బుతెరల కథలు, అగ్నిరేఖలు, ఝాన్సీరాణి (నాటకం), చెంఘిస్ ఖాన్ మొదలైనవి ముఖ్య రచనలు. చెంఘిస్ ఖాన్ నవల ఆంధ్రపత్రిక సారస్వత అనుబంధంలో సీరియల్ గా వెలువడింది. అనువాదమైనప్పటికీ, స్వాంతరచనే అయినప్పటికీ సూరి ప్రతిరచనలోనూ ప్రతిభా వ్యక్తిత్వాలు ప్రస్ఫుటంగా గోచరిస్తుంటాయి. అనువాదంలో అతని ప్రతిభకు 'రెండు మహానగరాలు' ఉత్తమ నిదర్శనం. ఇది ఆంధ్ర సచిత్ర వారపత్రికలో సీరియల్ గా ప్రచురణ అయింది.

జీవిత సమస్యలపైగాని, సాహిత్య సమస్యలమీదగాని, ఏ ఇతర విషయాలపైగాని తెన్నేటి సూరిని నిద్రలేపి అడిగినా ఖండితమైన, అతి స్వతంత్రమైన భావాలు ప్రకటించేవాడు. తన భావాలు ఎదటివారికి నచ్చినా నచ్చకపోయినా కుండబద్దలు కొట్టినట్లు నిర్మొహమాటంగా చెప్పివేయడం సూరి ప్రత్యేకత. తన కలం హలంగా, తాను సీరపాణిగా పత్రికల్లో సాహిత్య వ్యవసాయం చేశాడు. ఎప్పుడో నవయుగోదయ మవుతుందని దానికి నాందిగా "మానవ స్వాతంత్ర్య 'మాగ్నాకార్టా' పైన రక్తాక్షరాలతో వ్రాలు చేసేశాను" అని తన 'అగ్నిరేఖలు' అనే గేయ సంపుటిలో వ్రాసుకున్నాడు.

సూరి భావాలు మనకు ఇంకా స్పష్టంగా అవగాహన కావాలంటే "అగ్నిరేఖలు" లోని ఈ క్రింది పంక్తులు మచ్చుముక్కలుగా ఉపయోగపడతాయి.

"అంటరాదని ఒకడూ,
అధికుడని మరొకడూ,
గొంతుల్లు కోసుకుంటారా!
తల్లికందరు బిడ్డ లొకటేనురా!
తల్లి వింటే ఖేదపడుతుందిరా!"

అన్నాడు అంటరానితనం ఖండిస్తూ.

'కీలు గుర్రముపైన,
కాలీసు కానుకుని
ప్రాణాలు లేవట్టి
భగవంతు డొచ్చాడు—
ఊరంత ఊరేగుతూ
ఉత్సవము పొరించుతూ—
కూలి మాటడగండిరా!
అన్నాలు
చాలవని చెప్పండిరా!

ఇది కీలుగుర్రం అనే గేయంలోని తొలిపంక్తులు

నీ కవిని బ్రతికించుకోవాలిరా!
నీవు మనిషననిపించుకోవాలిరా!
బ్రతికి యున్నన్నాళ్లు పట్టెడన్నము నిడవు,
అతడు చచ్చిన వెనుక అందలాలంటావు.
నీకవిని...

అని హెచ్చరించాడు.

ఇంతేగాక భారతిలో కొన్నాళ్ళ కితం 'సీరపాణి' అనే మారుపేరుతో వారి రచించిన 'సాహిత్య సమాచారం', 'విరహ విషాద విషా హాచేస' అనే వ్యంగ్య రచనలు, తెలుగు సాహితీపరులను విశేషంగా ఆకర్షించాయి.

సహృదయుడు, స్నేహపాత్రుడూ అయిన తెన్నేటి వారి ఆంధ్రపత్రిక సంపాదకవర్గంలో సరిగా పదకొండేళ్ళ క్రితం ప్రవేశించాడు. ఇంచుమించుగా గత ఐదేళ్ళ నుంచీ 'భారతి' సహాయ సంపాదకుడుగా పనిచేస్తూ వచ్చాడు.

వారి స్వస్థలం కృష్ణాజిల్లా తెన్నేరు గ్రామం. శ్రీ తెన్నేటి తిరుమలరావుగారి జ్యేష్ఠపుత్రుడు. బందరు నోబుల్ కాలేజీలో ఉన్నత విద్యాభ్యాసం చేసి పట్టభద్రుడైనాడు. తండ్రి శ్రీ తిరుమలరావు గారు పరమపదించి ఆరునెలలైనా నిండాయో లేదో, ఇంతలోనే ఈ విషాద సంఘటనకూడా జరిగింది.

తెన్నేటి వారి అకాలమృతి తెలుగు సాహితీ ప్రపంచానికి తీరని లోటు. ఆప్త మిత్రుని మధుర స్మృతికిదే నా బాష్పాంజలి.

# 40 కోట్ల సమస్యల సమస్య

శ్రీ సా. సుబ్రహ్మణ్యశాస్త్రి

" అందువల్ల ఈ రెండు ఖండాల అఖండ ప్రజల ప్రగతి సమస్యను ఆర్థికంగానే గాక పారిశ్రామిక దృష్టితో కూడా చూసి అర్థం చేసుకోవడం అవసరమన్న భారత ప్రధాన మంత్రి ప్రవచనాలు, ప్రపంచ ఆర్థికవేత్తల ఢిల్లీ సభలో సూటిగా ఖండాంతర వాసుల హృదయాన్ని ఆవిష్కరించాయి అనవచ్చును. ప్రపంచ బ్యాంకు (W B) అంతర్జాతీయ ద్రవ్యనిధి (I M F) అంతర్జాతీయ పెట్టుబడి సంస్థ (I C F) ల మహాసభ భారత రాజధానిలో జరిగినందువల్ల చేకూరిన ముఖ్య ప్రయోజనాలలో ఇది ఒకటి. వెనుకబడిన దేశాలవారికిని, సహజ వాతావరణంలో నివసితిగతుల మధ్య అగ్రగాములకీ ప్రతినిధులు చూసి ఆ యా విషయాలను తెలుసుకోవడానికి అవకాశం కలిగింది.

అక్టోబరు రెండో వారంలో జరిగిన ఈ సభకు 68 దేశాలనుంచి దాదాపు వెయ్యి మంది వచ్చారు (వీరిలో ప్రతినిధులు 420 మంది మరి అంతే మంది సిబ్బంది) కలవారూ లేని వారూ కలసి జరిపిన చర్చల కలకలంలో భారతీయ విజ్ఞానభవనం నాలుగు గోడల పాటు ఆర్థిక భువన భవనంగా భావించింది. మహాసభకు బెల్జియం ఆర్థిక మంత్రి శ్రీ జీన్‌వాన్ హూట్ అధ్యక్షత వహించగా భారత ప్రధాన మంత్రి శ్రీ జవాహర్‌లాల్ నెహ్రూ సభను ప్రారంభించారు.

## రెండుఖండాల అఖండశక్తి

మూడుతరాల వెళ్ళగా నిద్రాణ స్థితిలో ఉన్న ఆసియా ఆఫ్రికాలు ఇప్పుడు మేలుకున్నాయి. ఇటీవలి సంఘటనల సంఘర్షణతో ఈ రెండుఖండాల జనతలో చైతన్యం ఒక్కసారిగా విజృంభించింది. అన్నవస్త్రాలు కూడా సమకూర్చ లేని కోట్లప్రజలు ఈనాడు తమ జీవన ప్రమాణాలు వృద్ధి చేసుకోవాలని సంకల్పించారు. వాళ్ళ అలా చేయరాదని ఎవరూ చెప్పలేరు. ఈ ఆకాంక్షామైన కృషిని ఎవరూ ఆపలేరు. వారి జీవన్మరణ సమస్యలు పరిష్కరించడానికి సహాయపడడం మంచి స్థితిలో ఉన్నవారి విద్యుక్తధర్మం. ఆ ధర్మాన్ని ముందుకాపాడే మరొకరు గుర్తెరుగుతారు. అందువల్ల వారు కర్తవ్యాలను ఆలోచించి నిర్ణయించడంలో ఈ వెనుకబడిన దేశాల

# గ్రంథవిమర్శనము

## యజుర్వేదభాష్యము

[తృతీయాధ్యాయము]

అనువాదకులు: ఆచార్యోపాధ్యాయులు. ప్రకాశకులు: ఆర్య కేశవార్యశాస్త్రి 8-5-1008 నారాయణగూడ, హైదరాబాదు, ఆంధ్ర ప్ర. రెండురూపాయలు

ఆర్యసమాజప్రవర్తకులు మహర్షి దయానంద సరస్వతి సంస్కృతంలో రచించిన యజుర్వేద భాష్యాని కిది ఆంధ్రానువాదము. అనువాదకులీ గ్రంథంలో మూల సంస్కృతభాష్యంకూడా ముద్రించారు.

దయానందసరస్వతి యజుర్వేద మంత్రాలకు పదక్రమము, ప్రతిపదార్థము, అన్వయము రచించి, ఆయామంత్రాలకు ప్రత్యేకంగా ఋషులను దేవతలను కూడా పేర్కొన్నారు. అంతేకాక ప్రతి పదానికీ ఛందస్సు, షడ్జాది స్వరాలు కూడా నిర్దేశించారు.

పాశ్చాత్య సంస్కృతి విద్వాంసులలో చాలా మంది వైదికమంత్రాలకు, దేవతలకు, సంప్రదాయాలకు కేవలం భౌతికార్థాలే ప్రతిపాదించారు. పూర్వకవాక్యాలాదిమమానవులనీ, ప్రాకృతికములయిన మొగ్గులు, మేఘాలు పృథివ్యాది పంచభూతాలు మొదలయినవి పరిశీలించి పరమాశ్చర్యయుక్తులై ఆయా వైదిక మంత్రాల రచన ఉపక్రమించారనీ వారభిప్రాయ పడ్డారు. వారిది కేవలం చారిత్రకపరిణామదృష్టి. కేటిగిరి శర్కిక భౌతికవాదులు, తిరితిరాలుకూడా ఈ విషయంలో ఇంచుమించుగా ఇదే దృక్పథం అవలంబిస్తున్నారు

మన సాంప్రదాయికమైన వైదికభాష్య దృష్టి పై వానితో ఏకీభవించదు. ఆయా దేవతలు భౌతిక స్వరూపాలున్నా నానారూపాల శక్తులనీ, దివ్యులనీ ప్రాచీను లభిప్రాయపడుతున్నారు. ఈ విషయంలో వీరిది ముఖ్యంగా ఆధ్యాత్మిక దృక్పథం.

దయానంద సరస్వతి ఆర్యసమాజ ప్రవర్తకులని అనుకున్నాము. అందుచేత వారి వేదభాష్యంలో మంత్రాల కక్కడక్కడ అపూర్వమైన దృక్పథం గోచరించడం సహజం. అయితే అంతమాత్రంచేత దయానంద వేదమంత్రాలకు తమ ప్రత్యేక దృక్పథాని కనుకూలంగా మార్పులు చేస్తున్నారని భావించ నక్కర లేదు. వీరి భాష్యంలో ప్రతిపదార్థ వివరణము చాలా వరకు సాంప్రదాయికమార్గమే అనుసరిస్తున్నది.

ఆంధ్రానువాదకులు మూలంలో ప్రతిపదానికీ తేట తెనుగుమాటలతో వివరణాలు, వ్యాఖ్యానాలు రచించారు. వీరి అనువాదం సంస్కృతభాష్యం అర్థం చేసుకోడానికేగాక, వైదికమంత్రాల అవగాహనకు కూడా చాలా సహాయం కలిగిస్తున్నది

మన సంస్కృతి విద్వాంసులలో వేదార్థం వివరించగలవారిని వేళ్ల మీద లెక్క పెట్టవచ్చును. తెనుగులో వేదార్థం వ్యాఖ్యానించే గ్రంథాలు, చాలా స్వల్పంగాను అసమగ్రంగాను ఉన్నాయి. ఎందరో ఒకరిద్దరు ఈ విషయమై కొంత ప్రయత్నించారు గాని వారి కృషి కొనసాగటం సాగలేదు

దయానందుని యజుర్వేద భాష్యమంతా ప్రస్తుత సంపుటంతో కలసి సంపుటాలలో పాఠకులకు కందించ తలచినట్లు ప్రకాశకులు తెలుపుతున్నారు.

వీరి కృషి తెలుగునాట లబ్ధప్రతిష్ఠులయిన వైదిక విద్వాంసులకు చాలావరకు సహాయ్యకారి కాగలదని ఆశిస్తున్నాము. వైదిక విద్యాభిమానులు పరిశీలించవలసిన గ్రంథమిది. 'శాస్త్రి'

## త్రివేణి

[పద్యకావ్య సంపుటి]

ప్రకాశకులు: శ్రీ గోదా గ్రంథమాల శ్రీమున్నారాయణపురము. ఉల్లిపాలెం పోస్టు, దివితాలూకా కృష్ణాజిల్లా వెల తెలుపలేదు

దీనిలో మూడు కావ్యాలున్నాయి. మొదటిది శ్రీ నల్లాన్ చక్రవర్తుల కృష్ణమాచార్యులుగారు రచించిన శ్రీ శేషోపచర్యము. రెండవది శ్రీ తి. న. రా. తిరువెంకటాచార్యులుగారు రచించిన శ్రీ వరాంకుశ శతకము. మూడవది శ్రీ నల్లాన్ చక్రవర్తుల వేంకట

